"హిస్ మాస్టర్స్ వాయ్స్"

# రికార్డుల్లో

## క్రొత్త టాకీ గీతాలు

ప్రతిభ వారి

## "పార్వతి పరిణయము"



శాంతికుమారి

శాంతికుమారి

| | |
|---|---|
| కరుణ గిరీశా<br>ఆహా వ్రతంబు | N. 18615 |

పారుపల్లి సత్యనారాయణ

| | |
|---|---|
| శివ శివ శంభో<br>ప్రేమ రూప | N. 18616 |



సత్యనారాయణ

శాంతికుమారి

| | |
|---|---|
| స్వామి వినా<br>విడువ కేగితివో | N 18617 |

ప్రతిభ పిక్చర్సు పార్టీ

| | |
|---|---|
| గౌరి కల్యాణం<br>విడువ కనుగొన | N. 18618 |

నేడే కొని వినండి.

"హిచ్. ఎం. వి." గ్రామఫోన్

వ్యాపారు లందరిగొద్ద దొరుకును.




---

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"

ఆంధ్రభూమి

సంపుటం : ౧౦. వృష, మార్గశిరము : డిసెంబరు, 1941. సంచిక : ౨.

# సంపాదకీయసమాలోచన

**జోగిరాజు పంతులు గారి ప్రజాసేవ**

రావుసాహేబు శ్రీగోకేటి జోగిరాజు పంతులుగారు చేయుచున్న ప్రజాసేవ విశేషంగా ప్రశంసనీయమైవుంది. వారు వ్యవసాయశాఖలో ప్రభుత్వోద్యోగముచేసి ఉపకారవేతనాన్ని పొందుతూవున్న వృద్ధులు. వారు ఇప్పుడు తమతనువునూ, ధనమునూ గ్రామోద్ధరణ కార్యాలకై ధారాదత్తము చేస్తూవున్నారు. తూర్పు గోదావరి మండలం వారి కార్యక్షేత్రం. కొండెవరం వారి కాపురపుకాణాచి, గ్రామోద్ధరణ ప్రచారకమండలికి వారు పదివేల రూపాయిల విరాళమిచ్చివున్నారు, వ్యవసాయశాఖలో తాము ఆర్జించిన విజ్ఞానాన్ని అంతటినీ వారు గ్రంథరూపాన్ని ఆంధ్రులకు పంచిపెడుతున్నారు. ఇట్టి మహనీయులు తాలూకాకు ఒకరువుంటే తెలుగుదేశం అచిరకాలంలోనే అభ్యున్నతిని అందగలదు. శ్రీపంతులుగారి ఆదర్శజ్యోతి తెలుగుదేశంలో అట్టి తేజాన్ని కలిగించునుగాక !

**ఆంధ్రరాష్ట్రము ప్రకాశము పంతులు**

విశాఖపురి ఆంధ్రమహాసభలో ఒక్కటే ఒక్క విశేషం నడిచింది. ఆవిశేషం ఏమిటంటే ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారి ఉపన్యాసం. కాంగ్రెస్‌మంత్రుల హయాములో ఆంధ్రరాష్ట్రవిషయమై జరిగిన కుంభకోణమంతా పంతులుగారు బయటపెట్టారు. శ్రీబులుసు సాంబమూర్తిగారి సీమ ప్రయాణం శాసనసభలో ఆమోదితమైన పిమ్మట ప్రధాని వాక్థానుంచి వద్దనేవార్త తెప్పించి తెలుగువారిచేత తెల్లమొగం వేయించాడు. ఆంధ్రరాష్ట్రవిషయమైకూడా ఇట్లే జరిగింది. కాబినెట్‌లో పదిమందిమంత్రులు, గవర్నరు అంగీకరించిన విషయాన్ని దుష్టబుద్ధి ఒకడు గవర్నరుచేత సున్నచుట్టించాడు. ఈసంగతిని ప్రకాశంపంతులు బయటపెట్టేశాడు, ఇందుకుగాను– ఈసారి కాబినెట్ ఏర్పడేటప్పుడు ప్రకాశంగారికి మంత్రిపదవి వుండకపోవచ్చునని మద్రాసు మెయిలు సంపాదకీయం బనాయిస్తూవుంది. ఇట్టి స్థితికి ప్రకాశం భయపడేవాడు కాడు. అతనికి పదవీ వ్యామోహంలేదు. ఇంతకూ ప్రకాశాన్ని వెలిబెడితే మదరాసు కాంగ్రెస్ మంత్రివర్గానికి శివుణ్ణి వెలిబెట్టిన దక్షునియాగపుగతే పట్టుతుంది.

**మదరాసు నగరము : ఆంధ్రరాజధాని**

1938 లో మదరాసు మహానగరంలో సమావేశమైన ఆంధ్రమహాసభ మదరాసు ఆంధ్రరాష్ట్రరాజధాని కావాలని తీర్మానించింది. 1939 లో గుంటూరుమహానగరంలో కూడిన ఆంధ్రమహాసభకూడా

[కొరవ ౬౪-వ పేజీలో.

# నిద్రబోతుతనం

[ హాస్యవ్యాసం ]

నిద్రబోతుతనం అందరికీ ఉపకారకమైంది. కాబట్టి అందరూ నిద్రబోతుతనం అలవరుచుకోవడం చాలా మంచిది.

రచయిత :

కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యమ్.ఇ.

మానవజీవితంలో నిద్ర మహత్తరమైంది. జీవితంలో సగభాగం నిద్రలోనే గడిచిపోతుంది. ఈ ప్రపంచంలో ప్రకృతి అంతా కుట్ర పన్నినట్టుగా బాల్యంలో ప్రతిజీవినీ నిద్రపొమ్మని ప్రోత్సహిస్తుంది. నిద్రపోని పిల్లలనుచూచి ఇదిఏదో గాడుసజాతి పిల్లర్రా నిద్రన్నాపోదసి అనేస్తారు.

ఆ మనుష్యులే పెద్ద ఎదిగిన వెనుక కాస్త పొద్దుఎక్కి లేచినా పగలు నిద్రపోయినా సోమరిపోతు అని చులకన చేస్తుంది.

బాల్యదశలో జీవుల్ని నిద్రపొమ్మని బాధించడంలో కూడా ఒక పరమార్థముంది.

బాలబాలికల పోషణ వహించిన వారు పిల్లలు మెళుకువగా వుంటే వారి అక్కరలు చూడటానికి తమకు తీరికవుండదని పని పాటలకు ఆటంకాలు కలుగుతాయని జోలపాడీ, నిద్రపోగొడతారు ఉయ్యాలలూపి జోకొట్టి వేడివేడినీళ్లు పోసి ఎట్లాగో నిద్రాదేవికి వప్పగించి తమ విజయం చూసుకొని విర్రవీగి పోతారు.

శిశువర్గం ఈరకం పితృవర్గం మీద ఎన్నోసారులు యుగయుగాలనుంచి తిరుగుబడుతూనేవుంది. రొదచేస్తూనేవుంది.

ఐనా పితృవర్గంపిల్లలమీద విజయంపొందుతూనే వుంది.

తల్లులతో పోరాడి పోరాడి హుంకరించి అలసి సొలసి సొమ్మసిల్లి నిద్రాదేవతవడిలో సేదతీర్చుకుంటారు పిల్లలు. పిల్లలు నిద్రపోవడం మంచిదంటారు.

అదే పెద్దలయితే అభ్యంతర పెడతారు. ఏమంటే నిద్రబోతులకు లక్ష్మి లభింపదంటారు, కాగా లక్ష్మి కటాక్షంపొందాలసి ప్రజలంతా పోటీతో ఒకరికన్నా ముందు ఒకరు నిద్రమంచాలు విసర్జించి నిత్యజీవిత ప్రవాహంలో దిగుతారు.

నూటికి 99 మంది గడియారంలో ముళ్ళుతిరిగినట్టు గంటల ప్రకారం లేచి కార్యకలాపంలో కాలు పెడతారు. ఉదయభానునికన్నా ముందుగాలేచి ఆఫీసులు, కర్మాగారాలు అనే జైళ్ళలో తమంతటతాము పడతారు అట్లాంటి వారు.

కాని కొంతమంది ప్రపంచాన్ని అంతను తిరస్కరించి పెద్దలమాట పెడచెవినిపెట్టి పొద్దుపొడిచినకొద్దీ ముసుకు బిగదన్ని కప్పుకున్న దుప్పటీలు చాలక పక్కదుప్పటీలు పరుపులుకూడా పైనవేసుకొని పడుకుంటూ కుంభకర్ణునిసోదరు లవుతారు. అసలు కుంభకర్ణుడు నిద్రాదేవతకు వలపుకాడు. అందుకనే ఆసోమరిపోతుని సంహరించడానికి నిద్రాహారాలు లేకండా పద్నాలుగేండ్లు అన్నా వదినలను కాచుకుకూచున్న జాగరికుడూ, నిద్రాదేవతకుసహోదరిఅయిన ఊర్మిళాదేవికి భర్తయగు సౌమిత్రి తపస్సుచేసాడు.

నిద్రాదేవత ఆవహించుటవల్లనే మనలో ఎంతమందో నిర్భాగ్యులయ్యారని మన పురాణాల్లో తెగవ్రాశేస్తే ఆ నిద్రవల్లనే కొందరు గొప్పవారు అయినట్టు పాశ్చాత్యగ్రంథాల్లో వ్రాయబడివుంది.

మాలుగుబోతులా నిద్రపోయేవాడు ప్రపంచానంతను ధిక్కరించే ధీరుడై వుండాలి. నిద్రపోయేవాణ్ని

ఎప్పుడు లేపినా విసుక్కుంటాడు. నాబోటి మోటవాడైతే లేపినవారిని వూదిపుచ్చికొడతాడు. అందుకనే వాల్‌పోలువంటి ప్రజ్ఞానిధి నిద్రబోయే కుక్కలను నిద్రపోనియ్యి కాని వాటిని లేపకన్నాడు.

ఎవరు కాని నిద్రపోయే వ్యక్తులను కాని సంస్థలను కాని రాజకీయాలను కాని లేపకూడదు. నిద్రపోయేవాటిని బాగా జోకొట్టాలి. లేపావా నీమీద ప్రళయం విరుచుకుపడ్డదన్న మాటే.

అస్తమానూ నిద్రపోయేవాడిని అందరూ ఏడిపిస్తారు. కప్పుకున్న గుడ్డనో కట్టుకున్న గుడ్డనో లాగుతారు. చేతిలో పేడ పెట్టి చెవిలో పుల్ల పెడతారు. సంస్థలైనా, జాతి ఐనా నిద్రపోతోవుంటే పేడకలాపి మొఖాన జల్లుతారు.

పక్షులుకూడా ఒక పక్షి లేస్తే అన్నీ లేచిపోతాయి. కాని మనకాజ్ఞానం లేదు. ప్రపంచమంతా జాతీయాభిమానంతో, భాషాభిమానంతో చచ్చిపోతూవుంటే మనం యింకా మంచాలు విడవనే లేదు నిద్రపోతున్నాం.

మనం నిద్రపోతున్నామంటే సోమరిపోతులమని అర్థం కాదు. తెలుగువాణ్ని ఎవరేనా సోమరి అంటే అన్నవాడు తెలివితక్కువవాడనక తప్పదు. మనకు నిద్ర ఎక్కువ. జాతీయంగాను, వ్యక్తిగతంగాను తెలుగువాళ్ళు నిద్రాప్రియులు. ఎక్కువ శ్రమపడేవారు ఎక్కువ నిద్రపోవాలి. తెలుగువాడుపడే శ్రమ ఆ పెరుమాళ్లుకే ఎరుక. అంత శ్రమపడతాడు కనుకనే నిద్రబోతు అయిపోయాడు.

తెలుగువానికి సృష్టిస్థితిలయాలు కరతలామలకం.

ఇతరులు దేనికైనా నెలకొల్పడానికి ఎంతో కాలం తీసుకొంటారు దాన్ని పాడుచేయడానికైనా వారికి అంతకాలంపడుతుంది.

మనకు అవిఅన్నీ క్షణికం. అందుకని సృష్టిస్థితిలయాదులు క్షణంలో ముగించి తిరిగి యోగనిద్రలో ప్రవేశిస్తాం.

# శ్రీ దుర్గాబాయి

"ఎవరి విలువ చెప్పకుండానే లోకానికి తెలుస్తుందో
వారు తమ విలువనుగురించి ఏమీ చెప్పనక్కరలేదు."

—*Fuller.*

రచయిత :

## 'కాస్యపి'

ఆధునికాంధ్ర రమణీమణులలో అగ్రస్థానంవహిస్తుంది శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయి,

ఆమె సేవాపరత, కార్యదీక్ష, పట్టుదల నిరుపమానమైనవి. నేటి ఆంధ్ర వనితాలోకాని కామె ఒజ్జబంతి అనడం సాహసంకాదు,

దుర్గాబాయి పుట్టినది మెట్టినదికూడా సామాన్య సంసారమైనా తన కార్యదీక్షవల్ల ఆమె పేరెన్నికగన్నది.

దుర్గాబాయి. 1909 అక్టోబరులో రాజమహేంద్రవరంలో తాతగారియింటియందు జన్మించినది. ఆమె తల్లిపేరు కృష్ణవేణమ్మ. తండ్రి రామారావు. ఇంటిపేరు చెన్నూరివారు.

ఆపుణ్యదంపతులకు ఒక పుత్రిక ఒక పుత్రుడు కలిగారు. పుత్రికారత్నమే మన దుర్గాబాయి,

ఆమె బాల్యజీవితం సామాన్యంగానే జరిగిపోయింది. అది నివురుకప్పిన నిప్పని గ్రహించినవారు ఆనాడు ఎవరూలేరు.

ఆమె భావి భాగ్యోదయమును సరిగా గుర్తింపలేని తల్లిదండ్రులు ఆమెకు బాల్యదశలో ముక్కుపచ్చలారని స్థితిలో అంటే ఎనిమిదవఏటనే వివాహంచేసారు ప్రాజ్ఞతవచ్చిన తరవాత— ప్రపంచమంతా తన కుటుంబంగా భావించే ఆ ప్రేమమూర్తికి సంసారకూపంలో పడివుండి పోవడానికి యిష్టంలేకపోయింది.

ఆమె సంసారిక జీవితం విషాదకరమయింది ఆమె జీవితచరిత్రకారులు ఆవిషయం తడవకండా వుండలేరు ఆమె సంసారిక జీవితఘట్టం హిందూ ధర్మంయొక్క దృష్టిలో చూచేవారికి ఒక మచ్చగా గోచరింపవచ్చు. కాని అది అంత ప్రధానమైందికాదు. ఆమె యశః చంద్రికలు ఆమచ్చను మాయం చేయగలవు.

ఆమె చిన్నతనంలోనే ప్రజాసేవకు కడంగినది. ఆమెపట్టు భల్లూకపుపట్టు. ఆపట్టుదలే ఆమె జీవితనావకు చుక్కానిగా పనిచేస్తోంది.

1922 లో అంటే పదమూడవ ఏటనే కాకినాడలో - బాలికాభివృద్ధికిగాను ఉత్సాహంతో హిందూబాలికా పాఠశాల స్థాపించింది. ఆమె సంఘసేవా సౌధారోహణకు ఇది ప్రథమసోపానం.

ఆమె ఆపాఠశాలను స్వశక్తిమీదనే పోషించింది. ఎప్పుడు ఆమె దృష్టి ప్రజాసేవమీదకు మరలిందో ఆమెకు కాంగ్రెసు వెల్లువ గోచరించింది. ఆమెకూడా ఆ మహాసముద్రంలో లీనమైపోవాలని తలచింది.

కాగా 1924 లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు స్వచ్ఛంద సేవకురాలుగా చేరింది,

అప్పటి ఆమె ఉత్సాహము కార్యదీక్ష పట్టుదల పలువురి నాయకుల దృష్టిని ఆకర్షించింది. ఆమెలో నిబిడీకృతమైన ఘనతరశక్తిని కనుక్కో కలిగారు. ఆమెకు చేయూతనిచ్చారు. ఆ ప్రోత్సాహంవల్లనే పట్టుదల విడవకండా కాంగ్రెసులోను, యితర సంఘసేవా సమాజాల్లోను అఖండఖ్యాతిసము పార్జించుకొన్నది.

[౬౧-పేజీలో చూడుము.

# ప్రియుడు

[ చిన్న కథ ]

'ప్రయత్నించడానికి యిన్నాళ్ళూ తనని అంధకారగుహలో కూర్చోపెట్టిన ఆదర్శాలు యిటూ— అటు ఆపోకిరి భర్త, కోతిముఖాల సంతానమూ అవకాశమిస్తే కదూ!'

రచయిత :

జనస్వామి కోదండరామశాస్త్రి

'ఒచ్చి చాలాసేపైంది. ఇక వెళతాను శ్యామా'

'అబ్బ! కూర్చోవే వెళుదుగానిలే. ఎంతోకాలమైంది నిన్ను చూసి. మా అత్తింటికొచ్చి నువ్వు నన్ను చూసేదేలేదు. పుట్టింటికైనా వొచ్చినప్పుడు చూసిపోతూ వుండు. మన బాల్యస్నేహం అంతటితోనే పోనీయకు. నేను ఎప్పుడో నాలుగేళ్ళ క్రిందట ఇక్కడకొచ్చినప్పుడు, కాస్సేపు మెరిసిపోయినావ్. మళ్ళీ అంతే. ఈ లోపల ఒకతడవ వొచ్చాను. అప్పుడు నువ్వు వూళ్ళో లేకపోయినావ్. పోతే, యీతడవ అప్పటి కప్పుడే నేనొచ్చి పదిరోజులైతే, నోరు తీపుపుట్టే లాగు కబుర్లుపంపగా, పంపగా దొరసానిగారి దర్శనం ఇప్పటికి లభించింది. ఇప్పటికైనా మీ యింటి అయ్యగారి శలవు లభించిందా! లేక చాటుగా వొచ్చావా!...'

'ఇంకా చిన్నప్పటిమాటలు పోనిచ్చావు కాదే, శ్యామలా! స్నేహితురాల్ని చూసివస్తానంటే వారు మాత్రం ఒద్దంటారా ఏమిటే? ... మళ్ళీ రేపు సాయంకాలాన వస్తాన్లే.'

'ఒట్టూ?'

'నిజం, ఒట్టు'

తనని చూడడానికి వచ్చిన చిన్ననాటి సావాసగత్తె కనకాన్ని, వాకిలివరకూ పంపిద్దామని బయల్దేరింది శ్యామల కనకం వెనకనే ...వీధి గుమ్మంపై మెట్లలో శ్యామల పాదాలు అతాత్తుగా నిల్చిపోయినై ... గుండెల్లో ... వెంట్రుకలు గుబురుగా పెరిగివున్న ఆముఖంలోని... ఆ చూపు ... విషాదంగా...ఏడిచింది. బాధగా అరిచింది...వింత అనుభవములు మనసులో కదిలినై ... ముందు మెట్లుదిగుతూన్న కనకంతో ఏమిటో మాట్లాడుతోన్న కంఠం టక్కున ఆగిపోయింది.

మాట్లాడుతూ, మాట్లాడుతూ అతాత్తుగా వూరుకున్న శ్యామల వంక కనకం వెనక్కి తిరిగిచూసింది ఆఖరిమెట్టుపైన నిల్చొని. వెంటనే శ్యామల గమనించి ఆతత్తరపాటును సర్దుకుంటూ నెమ్మదిగా అడిగింది: 'ఆ సందునే వెళుతూన్న ఆయనెవరే' అని.

'అతనా? గుర్తుపట్టలేదూ? పాపం!...ఆవిధంగా మారిపోయాడు...చిన్నతనంలో మనమందరమూ ఆడుకుంటుండేవాళ్ళం...ఎరగవూ ... నరసింహశాస్త్రి ... అతనే...'

హృదయాంతరతను దాచుకోవాలని చేసే శ్యామల ప్రయత్నం యీసారి వ్యర్థమైంది. ఆమె గుండెల అదటు, ఆమె నేత్రాలలోనూ, కణతల్లోనూ ఛక్కగా ప్రతిబింబిస్తోంది. నిర్జనమైన ప్రతిమవలె కదలిక లేకుండా అట్లాగే నిలబడి, అతను నడిచి వెళుతోన్న సందులోకి చూస్తోంది అశ్రుపూరితనయనాలతో. కొన్నిమాసాలు అదే తీరుగా కూర్చుని రాత్రిగాని గ్రం

ధంగా తయారుకాలేని విషయాలూ, సంఘట్టనలూ, ఒక నిముసంలో గుంపులు గుంపులుగా మిలమిలా మెరిసినై మనోవీథిలో.

కనకం తిరిగి పై మెట్టుమీదకు శ్యామలకు దగ్గరగా వచ్చి వీపు చరుస్తూ అంది: 'ఏమిటో...పాపం ...అట్లా మారిపోయాడు. ఎంత మందిచెప్పినా వినడు. సంసారమూ...భార్యా...అనే ధ్యాసేలేదు. యీ అయోమయుడితో వేగలేక ఆభార్య పుట్టింటి కెళ్ళిపోయింది... ఆముసలిముండ తల్లి వుండనుకుంటే ఆవిడ కాస్తా రాలిపోయి సంవత్సరం కావస్తోంది...ఇక ఇంకే?...వున్న ఆస్థిని అతని యిష్టంవచ్చినట్లు తగలేస్తున్నాడు.

ఎవరైనా 'బాబూ!ధర్మం'అని అడగడమే తడవు...చేతి కెంతొస్తే అంతే...ఎందువల్లనో పాపం ...అతనిలో విరక్తి ఎక్కువై పోతోంది, శ్యామూ!...జీవితాన్ని అమితనిర్లక్ష్యంగా వాడుకుంటున్నాడు...ఎంతో అవసరంవుంటే తప్ప, లేకపోతే ఎవరితోనూ మాట్లాడడు...ఆ ఇంటితలుపులు నాలుగూ లోపల గడియ వేసుకుని... లోపల...ఆ చిరుచీకట్లలో కూర్చొని ఏమి టేమిటో సణుక్కుంటాడట...ఎందుకో ఏడుస్తాడట...నవ్వుకుంటాడట...అసలీవూర్నుంచే లేచిపోవాలసిట ...ఆయిల్లూ, చెరువుదగ్గరి పొలమూకూడ బేరం పెట్టాడట. ఏముందే? అదీ జరుగుతుంది రేపో,మాపో...వెళ్లొస్తాను శ్యామూ!...మళ్ళీ రేపుసాయంకాలం... ఏం ... తప్పకుండా వస్తా...' అని ఆఖరిమెట్టునుంచి కిందకు దిగుతూ వాక్యం పూర్తి చేసింది.

వరండాలో ఎదురై 'మల్లెపూలు తెచ్చా నక్కయ్యా' అనే తమ్ముడిమాట తిన్నగా వినకుండా ...కటకటలాడుతోన్న కణతల్ని గట్టిగా ఒత్తుకుంటూ గబగబా గదిలోకి వెళ్ళి...కాళ్ళగాటునున్న బాలీసుదిండు... తలగాటుకు సర్దుకుని...పందిరి మంచంపై ... అయిష్టంగానే వాలింది.

* * *

మర్నాటి సాయంత్రం కనకం వచ్చింది.

ఇద్దరూ మాటా, మంచీ కాస్సేపు మాట్లాడుకున్నారు.

శ్యామల చాలా నిరుత్సాహంగావుండడమూ– ఆమె నేత్రాలు ఎర్రగా యీలావున వాచివుండడమూ– పరధ్యాసగా, దిగులుగా, పదిమాటలకు ఒకమాట జవాబీయడమూ, ఇవన్నీ, కొంతసేపటిక్రితం కనకం,శ్యామవద్దకు వస్తూ బజార్లో శాస్త్రితరహాను చూచినప్పుడు నిర్ణయించుకున్న అభిప్రాయాన్ని బలపర్చినై — అయినప్పటికీ ఒక పక్కన శ్యామ తనతోచెప్పని రహస్యం వుండదనే అనుమానం గుంజుతూనేవుంది.

ఇట్లా అనుకుంటూనే, అకస్మాత్తుగా జ్ఞాపకంవచ్చినట్లు నటిస్తూ అందికనకం:'చూశావా,శ్యామూ! నిన్న చూశామే... ఆశాస్త్రి... అతనికి ఇవ్వాళ్ళ పిచ్చెక్కింది. బజార్లంబడి వెర్రిగా పరుగులెత్తుతున్నాడు... దాయాలనుకున్న ఆఒక్కమాటా ఎక్కడ జారిపడుతుందో అని ఛటుక్కున వాక్ప్రవాహాన్ని ఆపేసింది.

ఈ మాటలువిని శ్యామ అదర్లేదు. బెదర్లేదు.

కాని, మాంసపుముద్దలవలెనున్న ఆరెండు నేత్రాలనుండి అశ్రుకణాలు వడివడిగా రాలుతున్నై బుగ్గలపైకి.

మోచేతులపై గడ్డంమోపుతూ శాంతంగానే అడిగింది శ్యామ: 'ఇంకా ఏమిటో చెప్పబోతూ ఆపేశావేం?' అని.

'ఆ..ఏముందే? పిచ్చివాళ్లు అనేకం వాగుతూంటారు.'

'ఏమన్నాడే! కనకం?'

'నాకు భయంవేసింది. ఏమిటో యిట్లా వాగుతాడని! ఎవరిపేరో ; ఏమిటో. ఆపేరుగల వాళ్లు లక్షమంది వుంటారు. ఇంకా ఇంటిపేర్లు కూడా వాగలేదు నయం.'

'ఏమిటే అసలుసంగతిచెప్పవ్?'

“ 'శ్యామా, నాశ్యామా'అని అరుచుకుంటూ వీధులలోబడి పరుగెత్తుతున్నాడు. ఆశ్యామ మరి ఎవరో; ఏమిటో పాపం!'

ఆమాట వినగానే శ్యామల అవురుమని ఏడిచింది.

కనకం, ఆమెకు ప్రక్కగా మంచంమీద జరిగి కూర్చుని ఆమెను ఒళ్ళోకి జార్చుకుని సాదరంగా తల నిమురుతూ 'ఏూరుకో శ్యామా! ఎన్నడూ చెప్పావు కావేం? అసలు విషయం ఏమిటో' అని అన్నది.

'ఆ శ్యామను—అతని శ్యామను నేనే... నేనే... ఏమని చెప్పను కనకం?... పదిరోజులతోనే అంతమైపోయిన వైభవాన్ని గూర్చి ఏమని చెప్పను?... అదే మా ఇద్దరికీ నశింపులేని బంధమైపోయింది ...అతని జీవితాన్ని పాడుచేసింది. ...అతని తెలివితేటల్ని గంగలో కలిపింది... ఇరవై యేళ్లు గడిచినా అది పాతపడలేదు. సడలిపోలేదు. నవ్యకళలతో వుట్టిపడుతూ నేటికీ ఆ అగ్ని అతని గుండెల్లో ప్రచండంగా రగులుతూనేవుంది... అతని యీస్థితికి నేనే కారణం... యీ మాట నిశ్చయంగా నేను యిప్పుడు తెలుసుకున్నాను.'

'దుఃఖించకు శ్యామా!' అంటూ శ్యామను కనకం ఆదరించగలిగిందేగాని తన కన్నీటినిమాత్రం అడ్డగించలేకపోయింది.

సింధూరవస్త్రాలంకరుడైన సూర్యభగవానుణ్ని దూరాన కొండవెనుక ఏదో ఒక నిర్భేద్యమైన శక్తి కాళ్లుపట్టుకుని కిందకు లాగేస్తోంది పాపం! శౌర్యమునూ. తీక్షణతనూ కోల్పోయిన ప్రభాకరుడు గిలగిలా కొట్టుకుంటూ కొండనానుకుని నిక్కినిక్కి చూస్తున్నాడు,

చిన్న నీటిప్రవాహంలో నీడగా తేలిపోతూండే వులిపిరి తెల్లకాగితంవలె ఆకాశపథాన కొద్దికాంతితో మెల్లిమెల్లిగా ముందుకు సాగిపోతోన్న చంద్రబింబాన్ని చూస్తూ, తమ ఇళ్ళముందు దొడ్లలో నిల్చొని, ధాన్యపుధర కొమ్మనీ, బంగారుధర కొమ్మనీ, అది కాదని యిది, యిది కాదని అది, వివాదాల్లోకి దిగుతున్నారు పల్లెటూరి పెద్దమ్మలు.

అప్పుడే వికసించిన మల్లెపువ్వులవలె విడబడినాయి శ్యామల నేత్రములు. బద్ధకంగా లేచి కూర్చుని నలువైపులా చూచింది. కనకం లేదు, మరెవ్వరూ గూడా లేరు. ఎదుటి దొడ్లోంచి ఆవు పెయ్య బాధగా అరుస్తున్నట్లు మాత్రం వినిపించింది.

శ్యామ మనోవీధిలో అంతులేని ఆలోచనలు గుంపులు గుంపులుగా ధ్వనిస్తున్నయి.

'తను నిజంగా ద్రోహికాదని ఎవరనగలరు?

'తనవాడు—తన సర్వస్వం—యిక్కడ యీవిధంగా అధోగతి పాలైపోతూంటే—తను అక్కడ—మంగళసూత్రం కట్టి తనపై సర్వాధికారాలూ సంపాదించుకున్న ఆ విశ్వాసహీనుడైన—తన 'భర్త' అని అందరిచేతా పిలిపించుకుంటూన్న— ఆయనతో... ఆయనకు ఒంగి ఒంగి నమస్కరిస్తూ ...ఆయన ఆజ్ఞల్ని అక్షరాలా పాటిస్తూ... ఆయన కామదాహానికి ఒక కుళాయిగా వుపయోగపడుతూ... ఏటేటా బలహీనపుబిడ్డ

లకు దుఃఖమయజీవితములను సృష్టిస్తూ... ఆ రోగాలకోరుతో ఏవేవో ఆదర్శాన్ని మనసులో వుంచుకు ఆత్మసంతృప్తి పొందుతూ ... కాపురంచేస్తూ కూర్చుంది .. యికముం దావని చెయ్యలేదు తను ...ఏమైనా సరే...'

మాతోన్మోత్సాహంతో లేచి గది లోకి నడిచింది శ్యామ. వెఱ్ఱి ఆనందంతో తన పెట్టెంతా కెలికింది. కొత్తది... కెంపురంగుచీరె పైకి లాగింది ......... మల్లెకాగుచ్ఛం మడిచి జడచుట్ట నోక్కుకుంటూ ......అద్దంముందు నిల్చుని చూసుకుంటోంది...ఆహా! తను ఎంత సౌందర్యవతీ...యీ మాట తన ముప్ఫయిఅయిదేళ్ళ జీవితంలో నూ యీ నాడు తెల్సుకుంది. అసలు అందుకు తను ప్రయత్నిస్తే గదూ? ప్రయత్నించడానికి యిన్నాళ్ళూ తనని అంధాకారగుహలో కూర్చోపెట్టిన ఆదర్శాలు యిటూ, అటు ఆపోకిరిభర్తా, కోతిముఖాల సంతానమూ అవకాశమిస్తేకదూ!

ఇప్పుడు తనని తను గుర్తించుకుంది. తన అందాన్ని గుర్తించుకుంది. లోకాన్నిగుర్తించింది— ఇదివఱకు ఏపనులు చెయ్యడాన్ని గురించి ఆలోచించడానికైనా భయపడిందో, వాటిని యిప్పుడు తను తెగువగా చెయ్యగలుగు! వాటి సత్యస్వరూపములను విప్పి చూపగలుగు!

ఎంతసేపటినుంచీ కనకంగుమ్మం దగ్గిర నిల్చునివుందో, ఏమో; శ్యామల తలయెత్తి చూసేసరికి, దగ్గిరకువస్తూ 'ఏమిటీ! ఈశ్శృంగారం. ఎక్కడకు ప్రయాణం' అని అంది నవ్వుతూ, శ్యామల తడుముకోకుండా, ఉత్సాహంగా జవాబుచెప్పింది 'నాప్రియుడి దగ్గిరకే...'

ఆమాటవల్ల కలిగిన ఆశ్చర్యంతో, రెండు నిముషాలపాటు అట్లాగే నోరు తెర్చుకుని నిలబడింది కనకం. తర్వాత— 'ఇంత సాహసమటే. లోకాన్ని చూసయినా—'

'హ్హా— హ్హా— హ్హా— ఇటువంటి భయాలతోనూ, పిరికితనంతోనూ, ఆదర్శాలతోనూ, మూల కూర్చున్నాను కాబట్టే నాకింత ముసుక్కొచ్చింది. ఇక నన్ను ఏదీ ఆపలేదు. నన్ను నేనేఆపుకోలేను. ...'

చీరెకుచ్చెళ్లు కొంచెంపైకి పట్టుకుంటూ బయల్దేరింది శ్యామ. ఆమె వెనకనే కనకంగూడా ఏమీ మాట్లాడకుండా నడవ నారంభించింది.

కొంచెందూరం సాగి వెళ్ళిన తర్వాత, వెనకనుంచి ఆదుర్దాగా 'ఏమిటా పొగలు, మంటలు?' అని అన్నది కనకం.

'చూద్దాం. మనం ఆవైపుకే వెళుతున్నాంగా.'

జనంక్రిక్కిరిసివున్నారు. శాస్త్రీ—అతనితోబాటు అతనియిల్లూ— దహనమై పోతున్నాడు. శ్యామల గబగబా పరుగెత్తుకుంటూ, అంతమంది జనంలోనూ తోసుకుని దారి చేసుకుంటూ మంటల్లోకి వెళ్ళిపోయింది.

అసుందరశరీరంలోని రక్తాన్ని ఇష్టంవచ్చినట్లు ఆరగిస్తూ, మత్తెక్కిపోయి ఆకాశాని కంటేలాగు గంతులేస్తున్నాడు అగ్నిహోత్రుడు.

---

# తేనె ఆహారపు విలువ

ఆధునిక పాశ్చాత్య వైద్యశిఖామణులు తేనె ఆహారంగా అమిత విలువ ఐందనీ- అది ఆరోగ్యానికి చాలా మంచిదనీ చెబుతారు.

అయితే తేనెయొక్క ఆహారపు విలువ, దాని ఆరోగ్యకర గుణమూ మనకు కొత్తలు కావు.

మన పూర్వులకు తేనెయొక్క విలువ బాగా తెలుసు.

నవీనయుగంలో పంచదార ఖరీదు బాగా చవకఐ తేనెవాడకాన్ని తగ్గించివేసింది.

గత శతాబ్దికి పూర్వం మానవుడు సగటున ఏడాదికి ఎనిమిది పౌనుల పంచదారమాత్రమే ఉపయోగించేవాడనీ, ప్రస్తుతంలో ఏడాదికి 112 పౌనుల పంచదారను ఉపయోగిస్తున్నాడనీ పాశ్చాత్య శాస్త్రవేత్త ఒకడు లెక్కకట్టి వున్నాడు.

ఆ శాస్త్రవేత్తే ఇట్టి లెక్క ఒకటి తేనెనుగురించికూడా చెబుతూవున్నాడు: నేడు మానవుడు సగటున ఏడాదికి ఒకటిన్నర పౌనుల తేనెను మాత్రమే ఉపయోగిస్తూవున్నాడని.

సూర్యకాంతి పడుతూవుండగా పూవులనుంచి తేనెటీగలు కూర్చిన తేనె తేనెపట్టులో కొన్ని మార్పుల్ని పొందుతుంది. అందులో కొన్ని రసాయనికపదార్థాలు చేరుతాయని చెబుతారు. వాటిని పాశ్చాత్య వైద్యవేత్తలు ఎన్జైమ్స్ (Eenzymes) అంటారు.

వివిధ పుష్పాలనుంచి సేకరించబడ్డ తేనె ఆయాపుష్పాల వాసన కొద్దిగా వేస్తుంది.

తేనెపట్టులనుండి కల్తీలేని నికార్సు తేనెను సంపాదించడానికి అనేకమైన విధానాలు కనుగొనబడి వున్నాయి.

లావ్‌లోజ్ (Laevulose), డెక్‌స్ట్రోజ్ (Dextrose) అనే రెండు రకాల మధురపదార్థాలతో తేనె నిర్మితమైంది. ఈమధురపదార్థాలు సులభంగా జీర్ణమయి శరీరానికి పుష్టిని కూరుస్తాయి.

ఇతర ఆహారపదార్థాలవలె తేనెకు కుళ్ళిపోయే స్వభావంలేదు.

నిప్పుదగ్గరపెట్టినా తేనె గట్టిపడదు.

ఒకవేళ ఎప్పుడేనా తేనె గట్టిపడినా తేనెసీసాను వేడినీటిలోవుంచితే తేనె తిరిగి పలచబడుతుంది. అయితే ఇందులో ఒక మెలుకువ వుంది. నీళ్లు బాగా వేడిగా వుండకూడదు. వుండినట్లయితే తేనె వాసన చెడిపోతుంది.

రెండు రకాలైన మామూలు మధుర పదార్థాలతో కూడి వుండడంవల్ల తేనె జీర్ణకోశానికి ఎప్పుడు కాని ఎక్కువ పనిని కల్పించదు.

తేనెయొక్క ఆహారపు విలువనుగురించి ఇద్దరు పాశ్చాత్య వైద్యులు ఏమిచెబుతున్నారో వినండి:

ఎడింబరో నివాసిఐన డాక్టర్ జి. యన్. డబ్ల్యు థామస్ ఇట్లు చెబుతున్నాడు:

'బలహీనమైన గుండెలకు తేనె మంచిపని చేస్తుంది. గుండెలకు అది మంచిశక్తిని ఇస్తుంది.

న్యూమోనియాజ్వరంలో అది రోగికి మంచి ఉపకారాన్ని చేస్తుంది. ఒక న్యూమోనియా రోగి తన రోగకాలంలో అప్పటప్పటికి రెండు పౌనుల తేనె పుచ్చుకున్న తరవాత త్వరత్వరగా కోలుకున్నాడు. జ్వరం రావలసినన్ని రోజులూ రాలేదు. అనుకున్నకాలంకంటె పెందలకడనే రోగి జ్వరవిముక్తుడైనాడు.

ఆరోగికి ఇంతటి మేలుచేసింది తేనే అని నేను రూఢిగా చెప్పగలను.

తేనె బలహీనులపాలిటి వరప్రసాదము. గుండె జబ్బులలో బాధపడేవారికి ఇంతకంటె గుణకరమైనది మరి ఒకటిలేదు.'

న్యూయార్కు నివాసిఐన డాక్టర్ పి. యఫ్. బెక్ ఇట్లు చెప్పుతున్నాడు.

'ఎనభై ఏళ్లు నిండిన నా రోగులలో, నాస్నేహితులలో పలువురు తేనెను దినదినమూ ఉపయోగిస్తారు. వారు చాలా ఆరోగ్యంగా, ఉత్సాహంగా వుంటున్నారు.'

నవీనయుగ పరిస్థితులు ప్రతివానినుండి ఎక్కువ శ్రమను కోరుతాయి. పూర్వపురోజులలో కంటె

ఇప్పుడు ప్రతివానికి ఎక్కువ శక్తి కావలసి వున్నది.

కాగా ఇప్పుడు ప్రతివారు సులభంగా జీర్ణమవుతూ విశేషశక్తిని ఇచ్చే ఆహారాన్ని చేకొనవలసిన అవశ్యకత ఏర్పడుతూవుంది.

మిఠాయి మొదలయిన మధుర పదార్థాలు అంతగా ఉపయోగకరమైనవికావు. ఏమంటే అవి సులభంగా జీర్ణంకావు, శరీరంలో అవి సులభంగా లీనమున్నూ కావు. పైగా అవి జీర్ణకోశంలో రోగానికి కారణమవుతాయి.

తేనెకు ఈదోషాలు ఏమీలేవు. ఆహారంగా తేనె అత్యుత్తమమయింది.

తేనె చర్మానికి చాలా మేలు చేస్తుంది. చర్మానికి అది అందాన్నికూరుస్తుంది. చర్మాన్ని చక్కగా కాపాడుతుంది.

నవీనులు సుభగంకరణం నిమిత్తం వాడే స్నోలలో, క్రీములలో పెక్కింటియందు తేనెకూడా చేరుతూవుంది.

ఎగ్జిమా అనే చర్మరోగానికి, దురద పొక్కులు మొదలయిన వానికి లోపలికి పుచ్చుకోడానికి, పైన రాచుకోడానికి కూడా తేనె చాలా మంచిది.

మంచిది, కొత్తది ఐన తేనెను తెల్లనీరుల్లిపాయల రసంతో కలిపి వెంట్రుకలకు పట్టిస్తే అవి బాగా ఎదుగుతాయి, రంగుమారి తెల్ల వెంట్రుకలు నల్లపడతాయి.

కాలినపుండ్లకు తేనె మంచి పైపూతమందు.

కల్తీలేని పట్టుతేనె పుష్టిని కలిగిస్తుంది. పుళ్ళను కుళ్ళకుండా చేస్తుంది. పుళ్ళకు క్రిములు మొదలయినవాని దోషం పట్టకుండా చేస్తుంది.

తులసి ఆకులరసంలో తేనెకలిపి పుచ్చుకుంటే జలుబు, దగ్గు నెమ్మదిస్తుంది.

వడపోసిన నీటిలో కాని, కాచిన నీటిలోకాని తేనెకలిపి పుచ్చుకుంటే జ్వరంవచ్చినప్పుడు మంచి ఉపయోగంగా వుంటుంది. ఈ ప్రయోగాన్ని పెద్దలూ, పిన్నలూ కూడా వాడవచ్చు.

తేనె, నిమ్మరసము సమభాగాలుగా కలిపి పుచ్చుకుంటే కంఠం బొంగురుపోవడాన్ని, ఇతర కంఠ రోగాల్ని పోకారుస్తుంది.

పిల్లల అహారంలో మధురపదార్థం సరఫరాచేయడానికి తేనె శ్రేష్టమైనది. పాలలో లభ్యమయ్యే మధురపదార్థంకంటె తేనెలోని మధురపదార్థం ఉత్తమమైంది.

పచ్చి కాబేజిరసంలో తేనె కలిపి రోజూ ఒకటిరెండు చెమ్చాలు ఈయడం చంటిపిల్లలకు చాలా మంచిది.

నెత్తురు పట్టడానికి, నరాలకి బలం కూర్చడానికి తేనె ప్రశస్తమైనది.

ఇనుము, సున్నము, సోడియము, గంధకము, మెగ్నీషియము, ఫాస్ఫారిక్ యాసిడ్, విటమినులు వుండడంచేత తేనె ఆదర్శప్రాయమైన ఆహారమైవున్నది.

పైగా తేనె ఏర్పడక పూర్వమే ఒకసారి జీర్ణమౌతుంది కాబట్టి ప్రతివారు దానిని నిరభ్యంతరంగా ఉపయోగించవచ్చు.

మానవజాతికి ఆరోగ్యాన్ని ఇచ్చే అత్యుత్తమ ఆహారపదార్థం తేనే అని శాస్త్రవేత్తలందరూ అంగీకరించి వున్నారు.

కల్తీలేని తేనె జీర్ణకోశానికి బలమిస్తుంది, జీర్ణశక్తిని పెంపొందిస్తుంది, గుండెజబ్బుల్ని నయం చేస్తుంది. నరాలకు, ఊపిరితిత్తులకు బలాన్ని ఇస్తుంది. తేనె మృదువైన విరోచనౌషధము. తేనె శ్లేష్మహరపదార్థాలలో శ్రేష్టమైనది.

పంచదార కారుచౌకకావడం వల్ల మనం మాధుర్యంకోసం ఎక్కువగా దానివే ఉపయోగిస్తున్నాము. ఆహారపదార్థంగా తేనె వాడకాన్ని తగ్గించడం మెచ్చతగిన విషయంకాదు.

నిత్యమూ ఆహారపదార్థంగా తేనెను ఉపయోగించడానికి మనం తిరిగి ప్రారంభంచేయాలి.

హిందూదేశంలో తేనె పుష్కలంగా దొరుకుతుంది. కాబట్టి మనం పంచదార వాడకాన్ని తగ్గించి తేనె వాడకాన్ని హెచ్చించడం మంచిది.

ఏమంటే! తేనె క్రిమి సంహారకమైనది ; రోగశమనకరమైనది; ఆరోగ్యకరమైనది.

# మార్గశిర పూర్ణిమ

ఆనాడు దత్తజయంతి. తెనుగువారు మార్గశిరపూర్ణిమను కోర్లపున్నమ అంటారు. యమదంష్ట్రదినాలపోకడను సూచించే పర్వంగా దీనిని నిర్ణయించవచ్చును.

మార్గశిర పూర్ణిమ. దత్తాత్రేయుడు పుట్టినదినం. కాబట్టి దత్తజయంతి.

ఈ పండుగకు కారణమైన పురాణగాథ ఇచట వివరింపబడుతూవుంది.

కలహాకారకుడైన నారదముని తన భక్తిప్రపత్తులచేత విష్ణుమూర్తిని ప్రసన్నునిగా చేసుకున్నాడు. అప్పుడు విష్ణువు అతన్ని ఏదేనా వరం కోరుకోమన్నాడు. అందుమీద నారదుడు తనకు విష్ణుమూర్తియొక్క సత్వరూపం చూడాలని వుందన్నాడు. దానికి విష్ణువు నారదునితో బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ని ఒకటిగా చేయగలిగితే నీవు కోరింది చూడగలవని చెప్పాడు.

అంతట నారదుడు భూలోకానికి వచ్చాడు. ఎట్లా ఐనా బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ని ఏకంచేయడానికి సంకల్పించాడు. ఇట్లా సంకల్పించి నారదుడు అత్రిఋషి ఆశ్రమానికి వచ్చాడు. ఆసమయంలో అత్రిఋషి ఆశ్రమంలో లేడు. కాగా అతని భార్య అనసూయ - పాతివ్రత్యానికి పేరుమోసిన స్త్రీరత్నం - నారదుడికి ఆతిథ్యం ఇచ్చింది.

ఆ మీద నారదుడు వైకుంఠానికి వెళ్ళాడు. అక్కడ అతడు లక్ష్మితో ముల్లోకాల్లోనూ అనసూయవంటి పతివ్రత లేదని చెప్పాడు.

భూలోకంలో అట్టి పతివ్రత వుండడానికి లక్ష్మి ఆశ్చర్యం పొందింది. విష్ణుమూర్తినిపంపి ఆమె పాతివ్రత్యం పరీక్షిస్తానని లక్ష్మి నారదునితో చెప్పింది.

నారదుడు పిమ్మట కైలాసపర్వతానికి వెళ్ళాడు. అక్కడ పార్వతితో అనసూయ ఖ్యాతి వినిపించాడు. అనసూయ పాతివ్రత్యానికి అసూయపొంది పార్వతి తనభర్తను పంపి ఆమె పాతివ్రత్యాన్ని పరీక్షిస్తానని నారదునితో చెప్పింది.

తంటాలమారి నారదుడు ఆమీద సత్యలోకానికి వెళ్ళి అక్కడ బ్రహ్మభార్యఐన సావిత్రితోకూడా అనసూయసంగతి చెప్పాడు. లక్ష్మి, పార్వతి ఏ నిశ్చయానికి వచ్చారో సావిత్రికూడా అదే నిశ్చయానికి వచ్చింది.

భార్యల ఆలోచనలఫలితంగా త్రిమూర్తులు బ్రాహ్మణవేషాలు ధరించి అత్రి ఆశ్రమానికి వచ్చారు. వచ్చిన ఆ బ్రాహ్మలు తమకు ఆకలిగా వున్నదనీ, అనసూయ విగతవస్త్రయై తమకు అన్నం పెట్టాలనీ కోరారు.

ఈ వింత కోరికను అనసూయకు ఆశ్చర్యం వేసింది. తన భర్తతో ఆలోచన చేసింది. అత్రి గొప్ప ఆత్మజ్ఞాని, యోగి. కాగా అతనికి అంతా తెలిసిపోయింది. వచ్చిన బ్రాహ్మణులు పరీక్షార్థం వచ్చిన త్రిమూర్తులనే సంగతి గ్రహించాడు.

అప్పుడు అతడు భార్యకు మంత్రోదకం ఇచ్చాడు. ఆ ఉదకం వచ్చినవారిమీద చల్లి ఆమీద వారికి అన్నం వడ్డించమన్నాడు.

మగని ఆజ్ఞప్రకారం అనసూయ వారిమీద మంత్రోదకం చల్లింది. తోడనే ఆ బ్రాహ్మలు ముగ్గురూ పసిపిల్లలు ఐపోయారు. అప్పుడు అనసూయ వారికి తన స్తన్యం ఇచ్చి వారిని తృప్తిపరచింది.

ఇంతలో హఠాత్తుగా నారదుడు అక్కడికి వచ్చాడు. త్రిమూర్తులు చిన్నారి శిశువులై అక్కడ ఆడుతూ వుండగా చూచి ఆనందించాడు. ఆనందించిపోయి ఆసంగతి త్రిమూర్తులభార్యలతో చెప్పాడు. అత్రి ఆశ్రమానికి తమ్ము తీసుకునివెళ్ళి తమ భర్తల్ని తమకు చూపించవలసిందిగా లక్ష్మి, పార్వతి, సావిత్రులు నారదుణ్ణి కోరారు.

అప్పుడు నారదుడు వారిని వెంటపెట్టుకునివచ్చి అల్లంతదూరాన్ని తాను దాగి అత్రి ఆశ్రమాన్ని వారికిచూపాడు. అక్కడ తమ భర్తలు బాలురై క్రీడిస్తూ వుండడం త్రిమూర్తుల భార్యలు చూశారు.

అందుతో వారికి గర్వభంగమైపోయింది. కాగా వారు అనసూయ పాదాలమీద సాష్టాంగపడి అక్కడ శిశువులై ఆడుతూవున్న ముగ్గురూ తమభర్తలైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులనీ, దయతలచి తమ పతుల్ని తమకు ఈయవలసిందనీ ప్రార్థించారు.

అప్పుడు అనసూయ భర్త ఆజ్ఞ పుచ్చుకుని ఆశిశువులమీద తిరిగి మంత్రోదకా

న్నిచ్చిల్లింది. తిరిగి ఆ శిశువులు విధి, నీల కంఠ, నీలవర్ణ రూపాలు ధరించారు.

ఆసమయంలో నారదుడు హఠాత్తుగా అక్కడికివచ్చి త్రిమూర్తుల్ని చూచి మీరు ముగ్గురూ ఒక్కచోట వున్నారు కాబట్టి మీ సత్వరూపం నాకు చూపవలసిందిగా కోరాడు.

నారదుని కోరికమీద త్రిమూర్తులు ముప్వురూ కలిపి దత్తాత్రేయ రూపాన్ని పొందారు.

దత్తాత్రేయుడు గొప్ప సన్యాసి. అతడు పుట్టినదినం బుధవారం, మార్గశిర చతుర్దశి. కృత్తికానక్షత్రం.

దత్తాత్రేయ దేవాలయాల్లో ఈనాడు కీర్తనలు సాగుతాయి. ఈదేవతపట్ల మహారాష్ట్రులు అతిశయమైన భక్తికలిగి వుంటారు.

దత్తాత్రేయులు ఉగ్రదేవత అని గర్గసంహిత చెపుతుంది. కావుననే దేశంలో దత్తాత్రేయ దేవాలయాలు మిక్కిలి తక్కువగా వున్నాయి.

ఈ దేవతకు గురువారాలు ప్రత్యేకం ప్రియమైనవని చెబుతారు. ఔదుంబరం - అత్తి - మేడి - మొదట్లో వుండడానికి దత్తాత్రేయుడు ప్రియంపడతాడు. కాగా ఆ చెట్టును హిందువులు అత్యంత పూజ్యభావంతో చూస్తారు.

దత్తజయంతి ఐన మార్గశిర పూర్ణిమను మనవారు కోర్లపున్నమ అంటారు. కోరల అమ్మవారు నూటఒక్క పుత్రలనోముపట్టి ఆవ్రతాన్ని ఈ నాటికి పూర్తిచేస్తుం దంటారు.

వైద్యశాస్త్రంలో కార్తికపూర్ణిమ మొదలు మార్గశిర పూర్ణిమవరకు గల దినాల్ని యమదంష్ట్రలంటారు. అంటే ఈరోజుల్లో యముడు కోరలు తెరుచుకుని వుంటాడని భావం.

ఈరోజులు చాలా అనారోగ్యకరమైనవి. ఈదినాలలో మరణాలు జాస్తి. మార్గశిర పూర్ణిమతో యమదంష్ట్ర దినాలు తుదముట్టుతాయి.

ఆ కష్టదినాలు తుదముట్టినందుకు సంతోష సూచనగా ఉగ్రదైవమగు దత్తాత్రేయునకు ఈనాడు పూజలు మన పెద్దలు ఏర్పాటు చేసివుంటారు.

# పురాణాల్లో చంద్రుడు

గురుతల్పగమనం సలిపిన పాపి—
అతనికి పొడలరోగం, క్షయరోగం—
దక్షుడిశాపం - పార్వతిశాపంకూడా వున్నాయి—
చంద్రుడు శివునితలపూవు కావడం ఇద్దరికీ ఉపకారమే—
చంద్రుడు అత్రినేత్రోద్భవు డంటారు—
అతడు కరిగించే శిల చంద్రకాంతశిల—
సోమలతకూ, చంద్రుడికీ అవినాభావసంబంధం —

పాశ్చాత్యుల పౌరాణికగాథలలో చంద్రుడు స్త్రీమూర్తి. కాని హైందవపౌరాణికగాథలలో అతడు పురుషమూర్తి.

మనదేవతల అందరిలోకిన్నీ అతడు మంచి అందకాడు. మన కవులు అందానికి అతనిని ఉపమానంగా ఎంచుతారు,



చంద్రశబ్దానికి అతిగా ఆకర్షించువాడు అనే స్థూలార్థం చెప్పవచ్చు అతనిఅందానికి ముగ్ధురాలై మగనితో కాపరంచేస్తూవున్న ముగువ ఒకతె మరులుకొన్నది.

దేవతలగురువైన బృహస్పతి వద్ద చంద్రుడు చదువుకోడానికి వచ్చాడు, బృహస్పతి భార్య తార. చంద్రసౌందర్యానికి మోహపడి తార అతన్ని తగులుకొంది. చంద్రుడు తారామనోహరుడైనాడు, వారికి బుధుడు పుట్టాడు.

గురుతల్పగమనం పంచమహాపాతకాల్లో ఒకటి. అట్టి పాతకం చేసినందుకు చంద్రుడికి పొడలరోగం పట్టుకుంది. ఎన్నిమందులు పుచ్చుకున్నా నయంకాలేదు.

అప్పుడు అతడు కొందరు మిత్రుల సలహామీద మహారాష్ట్రదేశంలోని పండరిపురానికి పోయి అక్కడినదిలో స్నానం చేశాడు. రోగబాధ తగ్గిందికాని పొడల ఆనవాళ్లుమాత్రం పోలేదు. ఆపొడల మచ్చలే నేటికిన్నీ చంద్రునిలో మనకు పొడకట్టుతూ వుంటాయి.

స్నానమాత్రంచేత చంద్రుడికి పొడలబాధ పోకార్చిన నదికి నాటినుండి చంద్రభాగ అనే పేరు వచ్చింది.



ఈ పౌరాణికగాథవల్ల చంద్రుడికి పొడలరోగముండేదని తెలుస్తూవుంది. మరిఒక కథవల్ల అతనికి క్షయరోగంకూడా వున్నట్లు ద్యోతకమవుతూంది,

ఆ కథకూడా వినతగిందే.

దక్షుని కుమార్తెలయిన ఇరవైయేడు తారల్ని చంద్రుడు పెళ్లిచేసుకున్నాడు. అందులో చంద్రుడు రోహిణిపట్ల విశేషానురాగాన్ని చూపుతూ వచ్చాడు. చంద్రుడికి 'రోహిణీవల్లభా!' అనే సంబుద్ధి వచ్చింది. తారలతండ్రి దక్షుడు ఇందుకు కినిసి అల్లుణ్ణి క్షయరోగపీడితుడవు కమ్మని శపించాడు.

అప్పుడు చంద్రుడు శివుని శరణుచొచ్చాడు. శివుడు అతణ్ణి తలపూవుగా ధరించాడు. ఫలితంగా చంద్రుడు తారలకు మరింత దూరమైనాడు.

ఇది సహింపలేక దక్షుడు శివుని వద్దకువచ్చి చంద్రుణ్ణి విడవమని కోరాడు. శరణార్థిని విడవడానికి శివుడు ఒప్పుకోలేదు, అందుమీద ఆగ్రహోదగ్రుడై దక్షుడు శివుణ్ణి కూడా శపించడానికి పూనుకున్నాడు.

ఇంతలో విష్ణుమూర్తి అక్కడికివచ్చి ఇద్దరకూ రాజీచేశాడు. చంద్రుణ్ణి రెండుభాగాలుచేసి విష్ణుమూర్తి - శరణార్థిఐన చంద్రుణ్ణి విడవననే శివుడికి ఒకభాగమూ, అల్లుడైన చంద్రుణ్ణి తీసుకుపోతాననే దక్షుడికి ఒక భాగమూ ఇచ్చాడు.

శివుని తలపూవు ఐన చంద్రుడికి క్షయరోగములేదు. తారల

భర్తఐన చంద్రుడికి వృద్ధిక్షయాలు వున్నాయి. దక్షునిశాపం, శివుని ప్రతిజ్ఞ ఈవిధంగా తొనితగువుగా నెరవేరాయి.



మరిఒక పురాణకథ చంద్రుని క్షయరోగానికి మరిఒక కారణాన్ని తెలుపుతూవుంది.

చంద్రుడు దేవతలకు అమృతాన్ని సరఫరాచేసే ఆసామి. శుక్లపక్షంలో అతడు అమృతాన్ని తయారుచేస్తాడు. కృష్ణపక్షంలో ఆ అమృతాన్ని దేవతలు పానం చేస్తారు. శుక్లపక్షంలో దినదినమూ అతడు అమృతాన్ని కూరుస్తాడు. కాబట్టే అతడు దినక్రమాన్ని తేజస్వి అవుతూవుంటాడు.

పూర్ణిమనాటికి అమృతభాండం నిండారుతుంది.

మరునాటినుంచి దేవతలు, పితరులు ఆఅమృతంపానంచేయడం ఆరంభిస్తారు. దినక్రమాన్ని చంద్రుని కాంతి తగ్గిపోతుంది. అమావాస్యనాటికి అమృతమంతా అరగింపు ఐపోతుంది. మరునాటినుంచి చంద్రుడు తిరిగి అమృతాన్ని తయారుచేయడానికి ప్రారంభిస్తాడు.

ఇట్లు చంద్రుని వృద్ధిక్షయాల మీద దేవతల అమృతపానం ఆధారపడివుంటుంది. కాగా దేవతలకు అతడు పరమోపకారి.



దక్షుని శాపంమూలకంగా చంద్రుడికి శివుని శిరస్సు ఎక్కేభాగ్యం కలిగిందని పైనచెప్పిన ఒక కథ రూపిస్తూవుంది,

ఇంకోకథ ఈ భాగ్యానికి కారణాన్ని ఇంకోవిధంగా నిరూపిస్తూవుంది. చిత్తగించండి :

దక్షుని యాగాన్ని చూడ్డానికి చంద్రుడుకూడా వచ్చాడు. దక్షాధ్వరధ్వంససమయంలో శివుని, అతని భూతాల వీరతాండవం నడిచింది.

ఆరభసంలో చంద్రుడు శివుని పాదాలక్రింద పడ్డాడు. ఆనలుగుడికి తాళలేక చంద్రుడు శివుణ్ణి ప్రార్థించాడు, అందుమీద శివుడికి జాలివేసి చంద్రుణ్ణితలమీద పెట్టుకున్నాడు,

## మహావాక్యరత్నాలు

ఓటమి అంటే ఏమిటి? విద్యావబోధనుతప్ప మరిఒకటి కాదు. అభివృద్ధికి అది ఒక సోపానము.

— *Wendell phillips*

మనము సేవించె దేవుళ్ళ దీపాలు మన ముఖాలమీద ప్రకాశిస్తవి.

— *Chinese proverb*

అప్పటప్పటికి సత్యం కొద్దిమంది దగ్గరే వుంటూవున్నా తుదకు ఆదే జయాన్ని పొందుతుంది.

— *Athanasius*

తమకు వచ్చిన కష్టాలకు అనువుపడిపోయేవారే తెలివైనవారు.

— *Hobbes*

అగ్నిపరీక్షలు నిన్ను విసిగించవచ్చు. అంతమాత్రంచేత నిరుత్సాహపడవద్దు. రాత్రిగర్భంలో పగలు వున్నది.

— *Saadi*

డాంబికత్వం అవలంబించడం తరుచు వినయానికి గుర్తు ఐ వుంటుంది కాని గర్వానికి కాదు.

— *Swift*

చిన్న చిన్న త్యాగాలవల్లనే సత్ప్రవర్తన ఏర్పడుతుంది.

— *Emerson*

నీకు సాయంచేసే హృదయం వున్నవారికి నిన్ను విమర్శించే స్వాతంత్ర్యం వుంటుంది.

— *Wm. Penn*

తనకు తెలిసిందంతా భార్యకు చెప్పివేసేవాడికి ఏమీ తెలియదన్నమాట.

— *Steel*

నవ్వు అనేది లేకపోతే రాత్రింపగలూ నేను పడుతూవుండే కష్టానికి ఈ సరికి చనిపోయివుండేవాడిని.

— *Abraham Lincoln*

మనదృష్టి ఎంత నిశితంగావుంటే మన మూసేవస్తువుల్లోని సౌందర్యం మనకు అంతగా కనిపిస్తుంది. ఆకలి ఎంత బాగా వుంటే అన్నం అంత రుచిగా వుంటుంది. చెవికి సంగీతజ్ఞానం ఎంత ఎక్కువగా వుంటే పాట అంత అపాతమనోహరంగా వుంటుంది.

— *Baxter*

దేవుడు చూస్తూనే వుంటాడు. మేఘాలు తమ పనిని ముగించుకున్న వెంటనే సూర్యుడు ప్రజ్వలిస్తాడు.

— *Anon*

❀

పై రెండుకథల్లోనూ చంద్రుడి ప్రార్థనమీదనే శివుడు అతణ్ణి తలపూవుగా ధరించాడని వుంది. ఈ సందర్భంలో ఉపకారమంతా చంద్రుడిపరంగా వున్నట్లు కనిపిస్తుంది.

కాని మరిఒక పురాణకథలో శివుడు తన ఉపకారం కోసమే చంద్రుణ్ణి తలపూవుగా ధరించాడని కలదు. అదికూడా వినండి.

చంద్రుడు శీతలకరుడు. కాబట్టి ఉగ్రమైన ఉష్ణాన్ని తగ్గించివేస్తాడు.

హాలాహలాన్ని పానం చేయడంచేత కలిగిన తాపాన్ని ఉపశమించుకోవడంకోసం శివుడు అనుష్ణకరుడైన చంద్రుణ్ణి తలపూవుగా ధరించాడు.

ఈ కథవల్ల ఈ సందర్భంలో ఉపకారమంతా శివుడిదిగా కనిపిస్తూవుంది,

❀

చంద్రుడికి దక్షుని శాపం వుండడం పైన తెలిసికొనివున్నాము,

దక్షునిశాపమే కాకుండా చంద్రుడికి పార్వతిశాపంకూడా వుంది. ఎవణ్ణి అయితే తనభర్త తలపూవుగా ధరించాడో అట్టి చంద్రుడికి పార్వతి శాపంఈయడం కొంచెం సిద్ధాంతంగానే కనిపిస్తుంది.

పార్వతి ముద్దులబిడ్డ వినాయకుడు ఒకనాటి సందెవేళ కడుపార భోజనంచేసి తండ్రిఐన శివుడికి నమస్కరించడానికి వెళుతున్నాడు. అసలే లంబోదరుడు. అందులో పొట్టనిండా భోజనంచేసి వున్నాడేమో అతడు అడుగుతీసి అడుగు పెట్టలేకుండా వుండి నెమ్మదిగా నడుస్తున్నాడు.

అతణ్ణిచూచి చంద్రుడు నవ్వా

[కొరవ ౨౦-వ పేజీలో.

ఆంధ్రదేశమంతటా డిసెంబరు 10-వ తేదీన విడుదల

ప్రతిభా వారి

# పార్వతీకళ్యాణము



తారాగణం:

రాధాకృష్ణయ్య
సత్యనారాయణ
శేషాచలం
శాంతకుమారి
కమలాదేవి
విజయ

*

| | | |
|---|---|---|
| బెజవాడ | : | దుర్గాకళామందిరం |
| గుంటూరు | : | సర్వతీటాకీస్ |
| తెనాలి | : | సత్యనారాయణటాకీస్ |
| బందరు | : | బృందావనటాకీస్ |
| ఏలూరు | : | పాండురంగటాకీస్ |
| రాజమండ్రి | : | జయటాకీస్ |
| కాకినాడ | : | మెజస్టిక్ సినిమా |
| విశాఖపట్టణం | : | సెలక్టుటాకీస్ |
| విజయనగరం | : | క్రిష్ణాసినిమా |

మ్యూజిక్: ఓ. రామచంద్రరావు.

డైరక్టరు: ఘంటసాల బలరామయ్య.

అసోషియేట్ డైరక్టరు: ఇ. యస్. యన్. మూర్తి.

*Sole Distributors:* **FAMOUS TALKIES, NELLORE.**

# పురాణాల్లో చంద్రుడు

[౪౯-వ పేజీ తరువాయి]

డు. అప్పుడు వినాయకునిపొట్ట పగిలింది. అందుకు కోపంవచ్చి పార్వతి ఎవరూ చంద్రుణ్ణి చూడకూడదనీ, చూచినివారికి నీలాపనిందలు వచ్చుననీ శాపమిచ్చింది.

చంద్రుణ్ణి చూడకండా వుండడం కష్టంకాబట్టి శాపానికి ఏదైనా నిష్కృతి చెప్పమని దేవతులు పార్వతిని ప్రార్థించారు,

అందుమీాద పార్వతి దేవతలతో వినాయకుని జన్మదినమైన భాద్రపద శుద్ధచవితినాడు మాత్రం కథాక్షితలు వేసుకోకుండా చంద్రుని చూడకూడదని నిష్కృతి చెప్పింది.



చంద్రుడికి ఇన్ని శాపాలు తగలడంవల్ల అతడు శాపాలు తెచ్చుకోడమేకాని శాపాలు ఇవ్వలేడేమో అనే అనుమానం కలగడానికి అవకాశంవుంది.

ఇట్టి అనుమానానికి అవకాశం లేకుండా చంద్రుడుకూడా ఒకణ్ణి శపించిన కథ ఒకటి ఇక్కడ తెడుముచాము.

మామఐన దక్షుడు తన్ను శపించినందుకు కినిసి చంద్రుడు ప్రతిశాపమిచ్చాడు. దక్షుడికి చంద్రుడు ఇచ్చింది నశింపుశాపము.

శాపం ఇవ్వడంతో ఊరుకోక అతగాడు తాను లోకాన్నుండి మాయమయ్యాడు.

చంద్రుడు లేకపోవడంవల్ల పంటలు, ఓషధులు ఎండిపోయాయి, దేవతలకు అమృతం కరవైంది. అప్పుడు దేవతలు చంద్రుడు తిరిగి వచ్చేటట్లు చేయమని బ్రహ్మను ప్రార్థించారు:

దేవతలు, రాక్షసులు క్షీర సముద్రాన్ని తరిస్తే చంద్రుడు వస్తాడని బ్రహ్మ చెప్పాడు దేవాసురులు అల్లే చేశారు: అప్పుడు పుట్టిన పధ్నాలుగు వస్తువుల్లోనూ చంద్రుడు ఒకడు.



ఇది చంద్రునికి పునర్జన్మ. అయితే అతని అసలుజన్మ ఎట్టిది ?

ఇది విచారింపతగిన విషయం.

చంద్రుడు విష్ణుమూర్తియొక్క యెడమకన్ను అని ఒకపురాణం చెబుతూవుంది. కాని పలు పురా

## తుమ్మిపూలు

"తావి లేదంచు నిరసింప తగదు మమ్ము,
తావిలేనట్టి పూలకు తావులేదు!
మానవుల యందు, ఎల్లరు మంచివారె?—
పై మెరుగుగాంచి లోకమ్ము ప్రస్తుతించు.

*　　*　　*　　*

చదువుకున్నారు, పుట్టిరి సత్కులాన,
మాట, మర్యాద, నేర్చిన మనుజులండి!
కట్నమే లేదటంచును కసరికొట్టి,
పెడమొగము ద్రిప్పినారేమి? పెండ్లి వేళ!

*　　*　　*　　*

తావి లేకున్న మాకేమి తఱిగిపోదు,
పరులకమ్ముడు బోయెడి బ్రతుకు కాదు—
పొదలమాటున నెచ్చటో యొదగియుండి
కాలమును బుచ్చుచుందు మీ కరణి మేము.
కన్నులను విప్పి లోకమ్ము గాంచుడింక:
కట్నములగోరి, యశమును కడకుద్రోసి
చదువుకున్నట్టి యువకుల చందమెట్లు
కాలిపోవుచున్నదో, కరుణతోడ."

—చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు.

ణాలు చంద్రుణ్ణి అత్రినేత్రోద్భవునిగా పేర్కొంటాయి.

చంద్రునితండ్రి అత్రి అని చెబుతారు: తల్లిసంబంధం లేకుండా పుట్టిన పౌరాణికపుత్రులలో చంద్రుడొకడు. చంద్రుని సముద్భవాన్ని గురించి రెండు పురాణకథలు వున్నాయి.

అత్రి ఒకసారి భార్యతో కూడి వుండగా ఇంద్రియం క్రిందపడింది. దానిని గాలి మూడుభాగాలుగా చేసింది. అందులో ఒకభాగం అత్రినేత్రంలో చొచ్చింది. ఆనేత్రంలోనుండి చంద్రుడు పుట్టాడు.

ఇది ఒకగాథ. ఇక రెండోగాథ వినండి.

అత్రి తపస్సుచేసుకుంటూ వుండగా అతని ఒకనేత్రాన్నుండి గొప్ప తేజస్సు వెలువడింది. ఆ తేజస్సును పదిదిక్కులూ భరించ ప్రయత్నించాయి. కాని సాధ్యపడలేదు. అప్పుడు బ్రహ్మ ఆ తేజస్సునంతా పోగుచేసి దానికి పురుషరూపం ఇచ్చాడు. ఆ పురుషరూపమే చంద్రుడు.

దేవతలకు ఆహారంగా వుండడానికి చంద్రుడు సృజింపబడ్డాడని ఒకపురాణం పేర్కొంటూవుంది. అయితే ఇదిన్నీ అతని పుట్టుకకు సంబంధించిన గాథే.



అతడు దేవతలకు అమృతం ఇచ్చేవాడైనా అతడున్నూ అమృతాన్ని తింటాడు. క్షీరసాగరమథనానంతరము దేవాసురులు అమృతపానానికి ఆయత్తులైన సమయంలో అసురలకు అమృతం లేకుండా చేయడానికి విష్ణుమూర్తి టక్కరివేషం వేశాడు. రాక్షసులయిన రాహుకేతువులు దొంగచాటుగా అమృతాన్ని పొందాలనిచూశారు. సూర్యచంద్రులు తమ కనుగీట్లతో ఆసంగతి విష్ణుమూర్తికి చెప్పారు. అప్పటినుంచీ సూర్యచంద్రులకు రాహుకేతువులపీడ పట్టుకుంది. ఈ పీడల ఫలితంగా సూర్యచంద్ర గ్రహణాలు తటస్థిస్తూవున్నాయి.



పీడలతో బాధపడుతూవున్నా చంద్రుడు మనకు వుండవలసినవాడే.

అతడు లేకపోతే దేవతలకు అమృతంలేదు. మనకు ఓషధులు లేవు.

చంద్రుడు ఓషధులకు అధిపతి. ఓషధులకు అతడు ప్రధానదోహదకారుడు.

ప్రచేతసులు ఒకసారి చెట్లను దహింపదొరకొన్నారు. అప్పుడు చంద్రుడు వారికి వృక్షసముద్భవ ఐన మారిష అనే కన్యకను ఇచ్చి తృప్తిపరిచి వారు చెట్లను కాల్చకుండా చేశాడు.

చంద్రునికి సోముడు అనే మారుపేరువుంది. వేదకాలమునాటి పవిత్రలతకు సోమ అనే పేరువుంది.

సోమలతనుంచి తయారైన పానీయాన్ని దేవతలు ఆప్యాయంగా తాగుతారని వేదవచనం. సోమపానీయాన్ని వేదాలు ఎంతగానో కొనియాడుతున్నాయి.

ఈ సోమలత ఇప్పుడు గుర్తింపబడలేదు. ఈలత శుక్లపక్షంలో రోజుకి ఒక్కొక్క కొత్త ఆకును తొడుగుతూ ఎదుగుతుందని చెబుతారు.

❦

చెట్లతోనేకాదు, మన పురాణాలు చంద్రుడికి రాళ్ళతోకూడా సంబంధాన్ని ఏర్పరుస్తున్నాయి.

చంద్రుడితో సంబంధం కల రాతికి చంద్రకాంతశిల అని సంస్కృతనామము. చంద్రుని కిరణాలు ఆరాతిమీద పడగా ఆ రాతి నుండి నీరు ఊరుతుందని చెబుతారు.

# చిరునవ్వులు

చిరునవ్వులు సర్వదా సంతోష భావాన్నే సూచించవు.

మర్యాదకోసమైనవి, రాజకీయపు ఎత్తుల్ని సూచించేవి ఐన చిరునవ్వులు వున్నాయి. ఆగ్రహాన్ని, ద్వేషాన్ని తెలిపే చిరునవ్వులున్నూ వున్నాయి.

సుఖమయభావంలోవచ్చే చిరునవ్వులు వున్నాయి. ఒప్పుదలనో, మెప్పునో తెలిపే చిరునవ్వులు కొన్ని. విసుగుపుట్టి, విరక్తిపుట్టికూడా చిరునవ్వులు నవ్వేవారు వున్నారు.

వృత్తి సంబంధమైన చిరునవ్వొకటి వుంది. వంచనతో ఇతరుల్ని పట్టికొట్టిస్తూ చేసే చిరునవ్వు ఒకటి.

వెకిలి చిరునవ్వు, వెలితి చిరునవ్వు సరేసరి. అల్లరి చిల్లరి చిరునవ్వున్నూ వుంది. అవివేకపు చిరునవ్వూవుంది. వంచనలో నెగ్గిన కారణంగా వచ్చే చిరునవ్వు ఒకటి.

ప్రేమనుకాని, స్నేహాన్నికాని, అనురాగాన్నికాని తెలిపే చిరునవ్వులు వున్నాయి.

తన అన్నిరేఖలలోనూ క్షుద్రకామాన్ని, అనుచిత మోహాన్ని తెలిపే చిరునవ్వులున్నూ వున్నాయి.

ఏహ్యభావాన్ని, అసహ్యాన్నిద్యోతకం చేసే చిరునవ్వులు కొన్ని. అన్నిటిలోనూ కీడునే చూసే చిరునవ్వులు ఒకరకము.

నిర్దోషమైన ఆత్మ ఉద్గారిత మైనశ్చే మధుర, ముగ్ధ, విశ్వసనీయ మందహాసము వుంది.

ఉత్తేజకరుడైన జీవి వెలిగించే కాంతి సంధాయక, తృప్తి ప్రదాయక, ఆశాపూరక మందహాసమువుంది.

చిరునవ్వుల్ని, వాటి అంతరార్థాన్ని గుర్తించు. నీ లోకజ్ఞానం విశేషంగా పెంపొందుతుంది.

# ఆరోగ్యసూత్రాలు

పరగడుపున ఒకగ్లాసెడు వేడినీళ్ళు తాగితే అజీర్ణం, అగ్నిమాంద్యంపోతుంది.

* * *

సూర్యోదయానికి పూర్వం చన్నీళ్ళలో స్నానంచేస్తూవుంటే ఇంద్రియనష్టము కడుతుంది.

* * *

ఆకుకూరలు విస్తరించి తింటే శరీరం నల్లబడుతుంది.

* * *

మీగడతో చిలికిన మజ్జిగ ఇంద్రియవృద్ధికరమైంది.

* * *

రాత్రిపూట పెరుగు పోసుకుంటూవుంటే సంభోగశక్తి తగ్గిపోతుంది.

* * *

విభూతిని నీళ్ళలోతడిపి పట్టువేయడం ఉదుకులోన్ రాయడంకంటె గుణకరమైవుంటుంది.

* * *

సుఖోష్ణోదకపానం కఫహరమైంది.

* * *

ముఖవికాసం కావలసినవారు చన్నీళ్ళస్నానాన్ని, ప్రణాయామాన్ని అలవాటు చేసుకోవాలి.

* * *

అచ్చంగా నిమ్మరసం పుచ్చుకుంటే వీర్యం నీళ్ళలాగా ఐపోతుంది.

* * *

కొబ్బరినీళ్ళలో కొబ్బరినూనె వేసి చిలికి వెన్నతీసి ఆ వెన్నతలకు రాసుకుంటే తల వెంట్రుకలు నొక్కులునొక్కులుగా వంకలు తేలుతాయి.

* * *

నిమ్మరసం చన్నీళ్ళలో కలిపి పుచ్చుకుంటే రక్తవృద్ధిఔతుంది.

# అద్దెవాటాలవారి అన్యోన్యత

'గోడమీదిపిల్లివాటంగా వ్రాసి అతనికతండె సాటి చతురబ్ధి పరీత మహీవలయంబునన్ అని అద్దెవాటాల వారి అన్యోన్యతను గురించి నిర్ణయించవలసి వుంటుంది.'

రచయిత :

## ఆకుండి వేంకటశాస్త్రి

ఇందాకటినుంచి నీవు అద్దెకొంపల్లో ఉండేవాళ్లు- ఆడవాళ్ళకు ఆడవాళ్లు, మొగవాళ్ళకు మొగవాళ్లు, పిల్లలకు పిల్లలు, అన్యోన్యముగా దెబ్బలాడకుండా యుంటారని నీకున్న కొత్త అనుభవముతో- నూటికి సగానికో సగానికి పైగానో దావా ఆస్తిపై ఫీజు పుచ్చుకుంటూ కంఠము చించుకొని బల్లలు గుద్ది లాపుస్తకములు లారిపోర్టులు ముందర పడవేసి హంగామాచేస్తూ వాదించే ప్లీడరులాగున- ఏం అల్లా వాదిస్తావు! నీకు అద్దె కొంపలలో ఉండేవాళ్ళంతా సోదర సోదరీలవలె మెలగుచు అన్యోన్య సహకారముతో తమ నిత్యజీవనమును అతి ఖులాసాగా గడుపుచూ యుంటారని కాబోలు నీయభిప్రాయము. నీకు ఆ దురభిప్రాయము కలిగి స్థిరపడుటకు కారణము బహుశః ఒకటి అయియుంటుందని అనుకుంటాను. ఆ అద్దె యిళ్ళల్లో నీ వృత్తి అవలంబించిన యింకొక ఉపాధ్యాయుడు వుండుటచే మీ యిద్దరకు కాలం కర్మము కూడి అన్యోన్య సామరస్యము కుదిరినది కనుక అందఱకు అట్లు ఆడవాళ్ళకు, ఆడవాళ్ళకు- పిల్లలకు, పిల్లలకు అన్యోన్యసౌమనస్యము. కుదురుతుందనుకుంటావు.

మొన్నను మన పక్కింటి సుందరమ్మగారున్ను వీరమ్మగారున్ను ఇంటికి పాచి చేసుకునే గుమ్మము నిర్ణయం విషయములో దెబ్బలాడి భర్తలవరకు ఆకేసు— వెళ్ళి ఆభర్తలుకూడా ఆ కేసులో తీర్పు యివ్వలేక ఎదుటియింటివారిని మధ్యవర్తులుగాపెట్టుకొని ఇంట్లోనివిషయమురచ్చకెక్కించినారు. అన్యోన్య సామరస్యమంటే యిదేనా? ఇంకా ఉన్నాయి. ఇల్లాంటివి ఊరికే ఒకటి మచ్చుకి చూపించాను.

ఇంక పిల్లలు దెబ్బలాట విషయములో ఒక ఉదాహరణము యిస్తున్నాను.

లక్ష్మమ్మగారిరామాభాయిన్ని, లీలమ్మగారి సుబ్బారావున్నూ ఆటలలో ఒకరిపై ఒకరికి కోపమువచ్చి తమ చేతులలోనున్న అస్త్రశస్త్రములవంటి లక్కపిడతలతో ఒకరినొకరు కొట్టుకున్నప్పుడు రామాభాయికి ముఖముమీద బలమైన గాయము తగిలినది. రక్తము వచ్చినది. ఆసంగతి వెళ్ళి వాళ్ళమ్మతో చెప్పినది. అంతటితో ఆకొట్లలోనున్న ఆడవాళ్ళకు తెలిసింది. వాది ప్రతివాదుల పక్షాన్న ఆ కొట్లలోనున్న వారందరికి రెండు కక్షలు ఏర్పడ్డవి. సాయంత్రము మొగవాళ్లు వచ్చేసరికి ఈ కేసు వారికి రిఫర్ చేయబడ్డది. వారంతా హైకోర్టు జడ్జీలవలె తీర్పులివ్వడం ప్రారంభించారు. వీరి తీర్పుల స్వభావంచూస్తే ఏతీర్పన కాతీర్పే గొప్పగావుండి ఒక తీర్పు ఒకపక్షమువారికి ఇంకొకతీర్పు ఇంకొక పక్షమువారికి అనుకూలముగావుండి మొత్తముమీద ఎవ్వరికి న్యాయము దొరకకుండావుండి ఆనాటినుంచి పిల్లలకు విరోధభావములు ఏర్పడి కలసి ఆడుకొనుట మానివేసిరి.

'అందుచేత ప్రతి విషయములోను మంచి చెడ్డ సమ్మిశ్రితమై యుంటాయిగాని మంచి అంతా ఇక్కడే దీనిలోనే వున్నది. చెడ్డఅంతా ఇది అని నిరూపించుటకు సావకాశము లేదు.

ఒకప్పుడు ఒక పల్లెటూరిలో పనిలేని భోజన్నముతప్ప ఏపనీలేని పెద్దమనుష్యులంతా రామాలయములో ఒకచోటచేరి అర్జునుడు గొప్పవాడా హనుమంతుడు గొప్పవాడా అని దెబ్బలాడి ఆకేసు రాజమహేంద్రవరములో ఒక మహాపండితునకు రిఫర్ చేసారుట. ఆపండితుడేమిచేసాడంటే వారిద్దరిలో ఒకడే గొప్పవాడని చెప్పుటకు సావకాశములేక అర్జునుని గొప్పతనము ఏవిషయములో ఉందో వ్రాసి, హనుమంతుని గొప్పతనము ఏవిషయములోఉందో వ్రాసి, చివరకు ఆయన గోడమీదపిల్లివాటముగా 'అతని కతండే సాటి చతురబ్ధిపరీత మహీతలంబునన్.' అని తేల్చాడు.

అద్దెవాటాలవారి అన్యోన్య అనుకూల్యాల విషయమైకూడా మనం ఇట్టి నిర్ణయమే చేయాలి.

# క్యాంప్ సామగ్రిపరిశ్రమ

ఆంధ్రేతరప్రాంతాలకు మనం సరఫరాచేసే పారిశ్రామిక సామగ్రులలో క్యాంప్ సామగ్రి ఒకటి. కాగా ఈ సామగ్రికి సంబంధించిన క్రింది విషయాలు మనం తెలుసుకోతగినవి.

రచయిత:

## మల్యాల శివరామకృష్ణ

మనదేశంలో ఉద్యోగాలు ప్రబలి ఒక పట్టణంనుంచి ఇంకో పట్టణంగాని, లేక ఒకే చోటనుండి చుట్టూవుండే గ్రామాలకుగాని తరుచూ ప్రయాణంచేసే ఉద్యోగస్తులూ ఎక్కువకావడంవల్ల వీరందరికీ ఒకచోటనుంచి వేరొకచోటికి అనువుగా, సులువుగా తీసుకువెళ్లే సామాను కావలసివచ్చింది. పెద్దపెద్ద మంచాలూ, కుర్చీలూ, మేజాలు ఒకచోటినుండి ఇంకొకచోటికి కదపడం కష్టం; అదీగాక తోవలో విరిగిపోవడంకూడా సంభవిస్తుంది.

వీరి ఉపయోగం నిమిత్తమై ఇమిడికగావుండే తేలిక సామగ్రి మనఆంధ్రదేశంలోతయారవుతోంది.

గుంటూరుజిల్లా, నరసారావుపేటలో ఈరకం మంచాలూ, బల్లలూ, కుర్చీలూ తయారుచేయబడుతోన్నాయి. ఎంత పెద్ద కుర్చీ అయినా, బల్లయినా ముడిచి మడిచి ఇమిడికగా చేత్తో తీసుకుపోవడానికి వీలుగావుంటుంది. వీటివల్ల కలిగే సౌఖ్యాన్ని గ్రహించి మకాములు వెళ్ళనవసరంలేనివారు కూడా అవసరంలేనప్పుడు ముడిచి మడిచి వేస్తే ఇంట్లో ఎక్కువస్థలం ఆవరించకుండా వుంటుందని ఈ క్యాంపుసామాన్లు కొనడం ప్రారంభించేరు.

నరసారావుపేటలో ఈ సామాను తయారుచేసే కార్ఖానాలు ఎనిమిది వున్నాయి. ఒక్కొక్క కార్ఖానాలో 20 లేక 25 మంది పని చేస్తోంటారు. ఈ పనివాండ్రంతా తెలగాలూ, మహమ్మదీయులూను.

ఇందు పనిచేసేవారంతా నెల జీతాలమీద నిర్ణయింపబడతారు. నెలకి రెండు రూపాయల చొప్పున పనిచేసే కుర్రవాడు మొదలు పాతిక ముప్ఫైరూపాయల వరకూ జీతం సంపాదించే నిపుణులు ఈకార్ఖానాల్లోవుంటున్నారు. కుర్రవాండ్రుచేసేపని కొలిమితిత్తులు వూదడం. పెద్దవారికి పనిసాయం చెయ్యడమున్నూ.

ఈ కార్ఖానాలన్నీకూడా ఈపనిలో ఆరితేరిన నిపుణులగు యజమానులచేత నడపబడడంచేత యజమానులు ప్రతిపనీ సరిగా జాగ్రత్తగా జరుగుతోవుందో లేదో స్వయంగా పరీక్షించి తెలుసుకోగలరు. అంచేత పనిలో ఏలోటుపాట్లూ వుండటానికి వీల్లేదు.

సాధారణంగా పని అంతా కూడా నెలకు 15రూపాయిల చొప్పున జీతం తీసుకొనే మధ్యరకం పనివారే చేస్తారు. ఇనప బద్దీలు, కమ్మీలు మడవడమూ సుత్తితో వంచడమూ, కర్రచెక్కుట, నునుపుచేయుట- వీరి పనులు.

సిద్ధపరచిన విడి భాగాలన్నీ అతిసామర్థ్యంతో కూర్చి ఆకారం తీసుకొనివచ్చే నిపుణులు ఒక్కొక్క కార్ఖానాకి ఏ అయిదారుగురో వుంటారు. వీరికే అందరికంటే ఎక్కువ జీతాలు.

ఈ పరిశ్రమకి కావలసిన ఇనప బద్దీలు, రేకులు, మడతబందులూ వగైరాలన్నీ మద్రాసునుంచి తెప్పించుకుంటూరు. ఇవి ఇదివరలో 20 మణుగుల తూనికగలవి (బద్దీలు) రు 30-35 ఖరీదువుండేవి. కాని ప్రస్తుతం యుద్ధంవల్ల ధరలు విపరీతంగా పెరిగిపోయేయి.

మద్రాసునుంచి నరసారావుపేట రావడానికి ఒక్కొక్క బారువకి రైలుఛార్జీ రు 6 అవుతుంది. ఇవి గుంటూరు నరసారావుపేటలలో ఇనుపవర్తకులవద్ద చిల్లరగా కూడా వెలకు దొరుకుతాయి, కాని ఖరీదు ఎక్కువ.

ఈ పరిశ్రమకి ఇంకా కావలసి

నవి తెల్ల దేవదారుకర్ర, టేకికలప. ఈ తెల్లదేవదారుకర్ర మంచాలూ, ఉయ్యేల కుర్చీలూ చేయడానికి ఉపయోగిస్తుంది. ఈకర్ర మలబారునుంచి తెప్పించుకోవాలి. ఇది ఘనపుటడుగు అయిదారు రూపాయలు వెలకలిగి కార్ఖానాదారులు కోరి ఆర్డరు ఇచ్చిన కొలతలలోనూ, సైజులలోనూ రీపర్లుగా సప్లై అవుతాయి.

దీనికి మలబారునుంచి రైలు ఛార్జీ ఘనపుటడుగుకు ఒక రూపాయ చొప్పున చూచుకోవచ్చు. ఇంక టేకు కలప ఘనపుటడుగు రు 4-8-0 లేక 5-0-0 చొప్పున బెజవాడలో దొరుకుతుంది. దీనికి కోతకూలి రు 0-12-0,

నరసారావుపేటలో తయారయ్యే సామాన్లలో మడత మంచాలు, (దోమతెర అమర్చుకోడానికి వీలుగావుండేవీ, సాదావికూడా) పడక, ఉయ్యేలకుర్చీలు, సాదా క్యాంపు కుర్చీలు, మడత మేజా బల్లలు, (వీటిలో డ్రాయర్లు అమర్చినవికూడా వుంటాయి) స్నానం చేసే పీటలు (వీటినే వ్రాతబల్లలుగా, డెస్కులుగాకూడా అమర్చుకోవచ్చు,) చిన్న పిల్లల తోపుడు కుర్చీలు, ఉయ్యేల స్టాండులు—ఇవి ముఖ్యమైనవి.

ఈ ప్రతీఒక్క సామగ్రిలోనూ వుండే ప్రత్యేక విశిష్టత ఏమిటంటే—తేలికగావుండటం- మడిచి ముడిచి చిన్నదిగా చేసుకుని సునాయాసంగా ఒకచోటినుండి ఇంకొక చోటికి తీసుకువెళ్ళే ఏర్పాటున్ను.

మొత్తంమీద ఇక్కడవున్న అన్ని కార్ఖానాల్లోనూ కలిసి నెలకు సగటున 6,000 రూ॥ ఖరీదుగల సామాను తయారవుతున్నది. కాని ఇక్కడి ఈ ఎనిమిది కార్ఖానాలవారిలోనూ ఒకరితోనొకరు పోటీ పడడంవల్ల వీరు ఎక్కువలాభాలు తీసుకోక స్వల్పలాభాలకే విడుదల చేస్తూవుంటారు.

చిన్న సామానులైన కుర్చీ, బల్ల మొ॥ వాటిపై రు 0-8-0న్ను, మంచములపై రు 1-4-0న్ను మాత్రమే లాభంవుంటుంది, అంటే రూపాయకూ అణా లేక అణాన్నర మాత్రమే నన్నమాట!

ఈ అన్ని కార్ఖానాలవారున్నూ యిప్పుడిప్పుడు వ్యాపారాన్ని నవీన పద్ధతుల్లో సాగిస్తో క్యాటలాగులూ మొదలైనవి అచ్చువేయించి విరివిగా ప్రచారం సాగిస్తోన్నారు. కొందరు ప్రచారం చేయడానికై కాన్వాసింగు ఏజంట్లను కూడా పెట్టి అభివృద్ధిలోకి తీసుకు వస్తోన్నారు.

మన రాజధానిలో వీటికుండే అమ్మకం అమెరికానుండివచ్చే గోల్డుమెడల్ ముద్రగల క్యాంపు మంచాలకికూడా లేదు. ఇవి బాగా ప్రచారం అయినతరువాత వాటి దిగుమతీ చాలావరకూ సన్నగిలింది కూడా.

ఇక్కడ తయారైన సామాన్లు మద్రాసు, బెంగుళూరు, దత్తమండలాలు, నిజాంరాజ్యము ఉత్తర సర్కార్లకే ఎగుమతీ అవుతాయి. అప్పుడప్పుడు పంజాబు, కలకత్తాలకుకూడా ఎగుమతి చేయడం కద్దు.

ఈ కార్ఖానాదారులంతా ధనవంతులవడంచేత ఈవ్యాపారానికి అర్థికలోపం లేదు. ఆ పట్టణంలో వున్న ఒక అప్పుల బ్యాంకిలో కావల్సినప్పుడల్లా అప్పు తెచ్చుకుంటూ వుంటారు.

ప్రతీముఖ్యపట్టణంలోనూ వీరికి ఏజంట్లువున్నారు. కాని వీరి పరిశ్రమ ఇంకా బాగా అభివృద్ధి పొందాలంటే పనిచేసే అన్ని కార్ఖానాలూ ఏకమై ఒకేసంస్థగా పోటీ లేకుండా పనిచెయ్యాలి.

కాళేయి స్టాండర్డు ఫర్నిచరు వారివలె వీరుకూడా మన ముఖ్య పట్టణమైన మద్రాసులోనూ, ఇంకా ఇతర పట్టణాల్లోనూ ప్రదర్శనశాలలు ఏర్పాటుచెయ్యాలి. పెద్ద పట్టణాల్లోని ప్రదర్శనశాలలు, షో రూములు- కాన్వాసింగు ఏజంట్లకంటె ఎక్కువగా పనిచేస్తాయి.

ఇట్టి సామగ్రులు గోదావరిజిల్లా లోని రాజోలు, అనంతపురం జిల్లాలోని మడకసిరా. గంజాంజిల్లాలోని బరంపురం మొదలైన ప్రదేశాల్లోకూడా చేయబడుతోన్నాయి ; కాని అవి అక్కడి అమ్మకానికేగాని వ్యాపారంచేసేటంత విరివిగా తయారు కావడంలేదు.

దేశంలో నాగరికత నానాటికి అభివృద్ధిపొందుతోన్న ఈనాడు ఈ వ్యాపారానికి మంచి భవిష్యత్తు వున్నదని చెప్పవచ్చు.

# క్షీరారామం

'దోమలకు మాత్రమే ఆటపట్టు అన్న ఊరిమధ్య
తేనెపట్టు కనుగొగలిగినప్పుడు మరేం సాధ్యం లేదు?'

రచయిత :
కవికొండల వేంకటరావు, బి.యే., బి.యల్.

సంస్కృతంలో 'క్షీరారామం!', తెలుగులో 'పాలకొలను!' రెండింటినీ సమన్వయించి ఒకానొక అర్థం స్ఫురించే ప్రత్యక్ష ప్రమాణ పదార్థంగా నిరూపించుకుంటే 'తోటలో కోనేరు'. తోట బత్తాయితోట. కోనేరు మంచినీళ్ళ కోనేరు. తోటలో కోనేటి వొడ్డునే కూర్చుని చెట్ల సందుగుండా పరకాయిస్తూ వున్నాను. పాలకొల్లు వూళ్లోకి వెళ్లడం అంటే భయం. దోమలు. ఊరినిండా దోమలే అని వాడుక.

తోటలో కోనేటి వొడ్డునే కూర్చుని చెట్లసందుగుండా పరకాయించగా, పరకాయించగా నాకేదో గోచరించింది. 'అదేమిటి? అనిఅడిగాను తోటమాలిని.' 'పాలకొల్లు గోపురం' అన్నాడు అతడు. 'చూడతగిందేనా?' అన్నాను. 'చూడతగింది, ఎక్కతగిందికూడా!' అన్నాడు గుర్రాన్నిగురించి చెప్పినట్లు. కాని వూళ్ళోకివెళ్ళడం అంటే భయం! దోమలు. ఊరినిండా దోమలే అని వాడుక.

కాబట్టి మంచి ఎండవేళ బయలుదేరాను. నానమ్మకం, ఆవేళప్పుడు దోమలన్నీ మలమలమాడి వుంటాయని, మనల్ని కుట్టవని, వీథంట స్వేచ్ఛగానడచి గోపురం సాంతంగా చూడవచ్చునని.

తెనుగునాటి గోపురాల్లో పాలకొల్లు గోపురమే అత్యున్నతమైనదిగా తోస్తుంది. మఱి గోపురంమీద కూర్చబడ్డ బొమ్మల సంఖ్యలు చాలవఱకు నాట్యాభినయంతో కూడుకొన్న స్త్రీ జాతివే. విశేషించి కనబడేది మహిషాసుర మర్దన నృత్యం. ఒక్క అంగుళంమేరకూడా వృథాకాకుండా గోపురం వెలుపలి భాగం అంతటా అలుముకున్నాయి విగ్రహాలు! అలా చేతులుచాచి, ఇలా కాళ్లుచాచి, అలా మెడమోసి, ద్వయ ద్వయాలుగా కుచాలుకాసి! మోహం అనేదే సున్నం గానుగులో పోసి ఆడి ఆసున్నంతో మోపికట్టారా ఆ గోపురం అన్నట్లు తోచకమానదు, ఆ బొమ్మలన్నింటినీ చూచేవాళ్ళకు. కాని అమాయకపు చిన్నపిల్లవాడు చూచే చూపుతో చూడాలి అన్నారు కొందఱు కళావేత్తలు. వెంటనే నాకేమిటిగా తోచిందిఅంటే, చిన్నపిల్లవాని చూపే కాకుండా, చిన్నపిల్లవాని చేష్టలుకూడా అలవరుచుకొని ఆయా అభినయరూపాల చేతులమీదుగా, వేళ్ళమీదుగా వాచిరు గజ్జెల కాళ్ళ నానించుకుంటూ శిశువునై ఎగబ్రాకి తుదీ అంతస్థుమీద వుండిపోవాలనిపించింది,

పదకొండంతస్థులిది ఆ గోపురం! ఒకదాని ద్వారంకంటె ఒకదాని ద్వారం చిన్నదై ఏదో లోకానికి గొంపోయేటట్టు తట్టింది. కాని నాకోరిక తీరని శైశవపు గోరికల్లో ఒక్కటిగా అయిపోయింది. లోతట్టు బాహాటమైన మెట్లబాటవుందంటే గోపురం లోతట్టుకు దృష్టి మరల్చి ఆమార్గం పట్టాం. చీకటిమయం, గబ్బిలాల కంపూను. ఒక్కొక్క అంతస్థుకెక్కి తిలకించబోతే- తలుపులు తెరచి బాహ్యప్రపంచం మీదికి దృష్టిపారిస్తే- ఎంతోదవ్వుకు ప్రకృతి కనిపించడమనేదే లేకపోతే మాకు సాంత్వనం లేదనుకోండి! తుదకు జుగుప్సకంటె ఉత్సాహం ఎక్కువైందన్నట్టు విడిచిపెట్టకుండా చివరి అంతస్థుకంటా ఎక్కిపోయినాం.

ఎక్కితే, ఆ అంతస్థు లోపలకు మనం దూరి వెళ్ళినా సందులేనట్టు అయిపోయింది. ఆ అంతస్థును పట్టి పెద్ద చేటంత తేనెపట్టు!!! దోమలకు మాత్రమే ఆటపట్టుఅన్న ఊరిమధ్య తేనెపట్టు కనుగొగలిగినప్పుడు మరేం సాధ్యం కాదు? 'శివుడు మనకెందుకు ప్రత్యక్షం గాడు?' అన్న ఆస్తికభావం మహత్తరంగా ఉరవైంది.

గోపురందిగి గుళ్ళోకివెళ్ళి తిలకించాను. లింగస్వరూపం నల్లరాతిని చెక్కబడి సర్వసాధారణపు ఎత్తునే నిరూపింపబడ్డా, నంది చెవులమీదుగా గనుగొన్నప్పుడు కుందనంలా మెఱిసిపోయింది కోటిపడగెత్తుకు.

పాలకొలను సుక్షారాని సమాశ్రయించుకున్నవాడై కుబేరుడు, తన అలకాపట్నాన్ని బడయనేరనటువంటి శివుని చెలిమి వడసి, విడిచిపెట్టకుండావున్న తావుకాదు కదా అది నేటికన్నీ?

# రామచంద్రకవి ఘనత

ఈ యేటి ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘ కార్యదర్శులుగా పనిచేసి గణ్యతగడించిన శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి ఘనతను ఈ వ్యాసం కొంతసు కొంత నిరూపిస్తూ వుంది. తిలక్ మహారాష్ట్రంలో తలపెట్టిన గణపతి ఉత్సవాలు మహారాష్ట్రుల అభివృద్ధికి ఎంతో తోడుపడ్డాయి. అల్లే రామచంద్రశాస్త్రిగారి రావలీలోత్సవాలు విశాఖపురి సాంఘిక జీవనాన్ని చక్కబరచడానికి ఎక్కువగా తోడుపడ్డాయి.

రచయిత :

## గొబ్బూరి వెంకటానందరాఘవరావు, బి.ఏ.

ముప్ఫయి మూడేళ్ళ క్రిందటి ముచ్చట !

1908-వ సంవత్సరం పీర్లపండుగరోజులవి. ఆవేళ పదకొండో సరకస్తు. విశాఖపట్నం మెయిను రోడ్డు అంతా మహా కోలాహలంగా ఉంది. డప్పులూ, తాషామర్పాలు, బాజాభజంత్రీలు వాయించగా కలిగే మహానినాదంవల్ల చెవులు బద్దలవుతున్నాయి. పులివేషాలు- మరికొన్ని వికారపు వేషాలు - అంతా మంచి సందడిగా ఉంది.

* * *

మెయినురోడ్డులో విన్నకోట అప్పల నరిసింహులశెట్టిగారు శారదా మకుటముద్రాక్షరశాల ఆఫీసుమీది డాబా. అక్కడ అంతా చాలామంది సమావేశమై ఆఊసు ఈ ఊసు చెప్పుకుంటున్నారు. అక్కడ కూర్చున్న వార్లలో ఒక ఆయన ముఖంమాత్రం కలివిడిలేక విచారగ్రస్తమై ఉన్నట్టు కనబడుతూంది. అప్పుడే దిగువవీధిలో మన్ను, మశాణం- బుగ్గి, బూడిద పూసుకొని ఆలీ,దూలఅనుకుంటూ గెంతులు వేసుకుంటూ కొందరు వెళుతున్నారు. అదిచూసి ఆయన 'ప్చ్' అంటూ నిరాశతో ఒకచప్పరింపు చప్పరించారు. అది శ్రద్ధగా గమనించి ఆపక్కనేఉన్న ఒక మహాశయుడు 'ఏమిశాస్త్రుల్లుగారూ! అలా చప్పరిస్తున్నారు?' అనిప్రశ్నించారు.

శాస్త్రుల్లు :

'మీరు అలాసంతోషిస్తూ ఉంటే నేను ఇలా సంతోషిస్తున్నాను.

మహా :

'ఏమిటి? ఏమిటి? చెప్పండి.'

శాస్త్రుల్లు :

'ఏమిటి చెప్పడం? ఎప్పుడో అరేబియాలో మహమ్మదీయుల పూర్వులు చచ్చిపోయినారు. వారికి ఏడుపుదినాలు. అవి మనవాళ్ళకి పీర్లపండగ అయింది. ఆవేళ ఎంత బీద మహమ్మదీయుడైనా మంచి గుడ్డలు కట్టుకొని, ఉత్సవంతో కులాసాగా తిరుగుతూ ఉండగా మనవాళ్లు మన్ను మసీ పూసుకొని 'ఆలీ, దూలా' అని కేకలు వేస్తూ ఉంటే- ఆ మాటలు తెనుగులో బూతుమాటలు కూడాను- పెద్దలంతా చూచి విని సంతోషిస్తున్నారు కాని ఏమిరా? మన కేంపని? మనపండుగ కాదే. రామకృష్ణా అనుకోండి అని చెప్పే దిక్కులేకుండా ఉంది మనసంఘం—కాబట్టి ఇలాకాకపోతే మరెలా సంతోషిస్తాను'

మహా :

'ఐతే ఏంచేయడం?'

శాస్త్రుల్లు :

'ఏంచేయడం ఏమిటి ! అన్నీ సిద్ధంగాఉన్నా మనకు ఐకమత్యం లేదు. పీర్లపండుగలు సంవత్సరానికి పది పదకొండు రోజులు మాత్రం వస్తవిగాని మనపెద్దలు, లెక్కప్రకారం, సంవత్సరముకు 2 సార్లు 10 దినముల చొప్పున ఉత్సవాలు ఏర్పాట్లుచేసినారు. మొదటిది సంవత్సరాదినుండి వసంత నవరాత్రాలు. దశమి పగలు అంతాకూడా వానిలోనే చేరును. అలాగే 6 నెలలువెళ్ళి ఏడో నెల వచ్చే

సరికి శారదనవరాత్రులు వచ్చును. అందులో వసంతనవరాత్రుల రోజులనాటికి పంటలన్నీ చక్కగా పండుతవి. వర్ష బాధలు ఉండవు. వేడీ, చలీ మిక్కుటం కాని సమకాలం; చక్కని దినాలు. వానిలో శ్రీరామనవమి వచ్చును- శ్రీరాముడు మన శైవ వైష్ణవములకు రెండిటికీ ఇష్టుడు. అంతేకాదు. అష్టాదశ వర్గాలవారు శ్రీరాముని భక్తితో కొలుస్తారు. మాలపల్లెలో కూడా శ్రీరామునికి కోవెలలు ఉన్నవి. కాబట్టి వసంతనవరాత్రులలో శ్రీరామకథ ముఖ్యంచేసుకొని ఉత్సవం చేస్తూ- ఈ పసికిమాలిన వేషాలకు బదులుగా మొగవాడుఉంటే వీరాంజనేయ వేషంవేసి అశోకవనం పాడుచేసిన తరువాత తోరణస్తంభంమీద ఎక్కి రాక్షసుల్ని చంపుతున్నట్టు బండీమీద 'మల్కన్' కట్టి దానిమీదనుంచి రాక్షస వేషాలువేయించి వాళ్ళతో యుద్ధం చేయించి చంపుతూ మళ్ళీ తోరణస్తంభంమీదకు ఎక్కుతూ ప్రజ్ఞ చూపించవచ్చును. వేడుకకు,వికార వేషములకు రాక్షస వేషములు ఎన్నైనా వేయవచ్చును.

ఐతే ఏంలాభం? 'దరిద్రాణాం మనోరథం' అన్నట్లు నావంటి వానికి ఉద్దేశాలుఉన్నా- ఏమిలాభం? అందుకోసమే ఈ విచారము' అన్నారు. ఇదంతా శ్రద్ధగా వింటున్న ఆ మహాశయులున్నూ, ఆయింటి యజమాని శెట్టిగారున్నూ ఏదో ఆలోచిస్తున్నట్టు కనబడింది.

* * *

తర్వాత మరికొన్ని నెలలకు విశాఖపట్నం సీతారామస్వామి కోవెలదగ్గర కవిగారి ధర్మాశ్రమంలో ఉదయంవేళ—వెనుక మనం డాబామీదచూసిన మహాశయులున్నూ, శెట్టిగారున్నూ ఉత్సాహంగా ప్రవేశించారు. మామూలు మర్యాదలైన తర్వాత ఆ మహాశయులు 'శాస్త్రుర్లుగారూ ఒక పనిమీద వచ్చినాము. మీరు అవునంటే చేస్తాము. లేకపోతే మానేస్తాం.' అన్నారు.

శాస్త్రుర్లు :

'పనేమో చెప్పండీ అవునూ, కాదూ అని నేను ఎలాచెప్పగలను?'

మహా :

'అప్పుడు వీర్లపండుగలో అనుకున్నామే అది. సంవత్సరాదిసమీపిస్తున్నది సన్నాహం చేతామని.'

శాస్త్రుర్లు :

(అతిగా వికసించిన ముఖముతో) 'ఓ! అంతకంటేనా' అని హర్షంతో ఒక గంతువేసి తప్పకుండా చేదాం' అన్నారు.

మహా :

'దీనినిగురించి మనం ఎవర్నీ ఏమి అడగనక్కరలేదు.'

శాస్త్రుర్లు :

'మరీ సంతోషం. రేపటినుంచి బయలుదేరుదాము.'

* * *

ఇందులో శాస్త్రుర్లుగారు మన మారేపల్లి రామచంద్రశాస్త్రికవిగారు. వారితో చర్చలుచేసిన మహాశయులు శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవు ప్రస్తుత జయపురము మహారాజావారు. సాహిత్యసామ్రాట్టు. డిలిట్. ఆంధ్ర యూనివర్సిటీ ప్రోఫాన్సరువారు. శ్రీ కవిగారి మనః సంకల్పమునకు మహారాజావారి సాహాయ్యము బలమిచ్చి కార్యరూపమునకు తేజాలినది. ఇట్టి పరిస్థితులలో నాడు ప్రారంభమైన శ్రీరామలీల మహోత్సవ ప్రభావము వలన ఇంచుమించుగా నాస్తికమునకు దిగుచున్న విశాఖపట్టణము ఆస్తికతకు మరలినది. హిందూమతము పునరుద్ధరింపబడినది. సంఘము సంస్కరింపబడినది. కళలు అభివృద్ధిచెందినవి. పనిలేని వారికి పనికల్గినది. పేదలకు కడుపునిండ అన్నము దొరుకుచున్నది. పెద్ద పండుగకు పుట్టినయిండ్లకు పోవుట మాని విశాఖపట్టణపు ఆడపడుచులు ఈ ఉత్సవములు తిలకించి సంతోషించుటకు వసంత నవరాత్రులకే పుట్టిన ఇండ్లకు విశాఖపట్నము వచ్చుచున్నారు. ముప్పదిమూడు సంవత్సరములలో విశాఖపట్టణమునకు ఈ విధముగ ఇంత మేలు చేకూరుటకు శ్రీకవిగారి సంకల్పబలమే కారణము. తెనుగుదేశములో ఇంతవరకు ఇటువంటి ఉత్సవములు జరిపించక ఉపేక్షించుచున్న ఇతర పట్టణములవారున్నూ, గ్రామములవారున్నూ విశాఖపట్టణమునుచూచి ఇటుపైనైననూ రామలీలోత్సవములు జరిపి ధన్యులగుదురు గాక!

# కథాసాహిత్యం

'కాబట్టి కథలు అంతవాస్తవిక తత్వంలో పర్యవసన్నం కాకండా... అతి క్షుద్రమైన, సంకుచితమైన ఈ యథార్థ జీవితమునుంచి మనల్ని ఉత్సాహానికి కొనిపోయేట్లు ఉండాలి.'

రచయిత:

## పురాణం కుమారరాఘవశాస్త్రి, బి.యే.

'ఎందుకొచ్చిన కథలివి? ఎల్లిమీద మల్లి పడ్డదనీ, మల్లిమీద ఎల్లి పడ్డదనీ... ఇంతేకద!' అంటూ పండితశిఖామణి ఒకాయన ఒక సుప్రసిద్ధరచయిత కథా సంపుటి చేత పట్టుకుని అతిహీనంగా వ్యాఖ్యానించటం జరిగింది ఒకసారి. నేను విని చాల విచారించాను.

అయినా కథలు విద్వాంసుల మనస్తుష్టి కేమీ రాయబడటంలేదు. వాళ్ళెంత ఏవగించుకుంటున్నా కథాసాహిత్యం ఒక విశిష్టగౌరవాన్ని పొందుతూనే ఉంది; దాని భవిష్యత్తు ప్రశస్తంగానే, ఉజ్వలంగానే కనిపిస్తున్నది.

ఈ పండితులకు కథాసాహిత్య మంటేనే అసలు కిట్టదని చెప్పలేం. పూర్వ సాంప్రదాయాల్ని అంటిపెట్టుకుని, విప్లవం సహించలేని తత్వం కలవాళ్ళవటం చేత, కథాసాహిత్యంలో వచ్చిన కొత్త పంథాలు చూచేసరికి ఒళ్లు కంపరం ఎత్తుతుంది. రామాయణ భారతకథలు, పురాణ గాథలు—ఇవన్నీ కథలు కావూ! వాళ్ళ కవి శిరోధార్యములే కదా! వాటికి మళ్లేనే నీతి- నియమాలనూ; ధర్మ పన్నాలనూ, ప్రబోధించే కథలు రాస్తే తప్పకుండా మెచ్చుకుంటారు. కాని పాశ్చాత్య సాహిత్యాల్ని చవిచూచినవాళ్లు ఈనాడు అల్లాంటి కథకు డెవడేనా ఉంటే గేలిచేసి విడిచిపెడతారు. "అహాహా! అపరభర్తృహరి, నీతివేత్త అవతరించాడు" అంటారు.

విరోపీయ సాహిత్యాల ప్రభావం కారణంగా మన తెలుగులోకూడ కథారచనా విధానం మార్పులు తిన్నది. నీతో, ధర్మమో, నిశాలభావ మేదైనానో ఉద్ఘాటించేందుకుగా ఇప్పుడు కథలు రాయబడటం లేదు. 'ఇప్సన్' గ్రంథాలు చదివినప్పుడే ఆదర్శవాదానికి దణ్ణం పెట్టాం; ఆదర్శకాల్పనిక చిత్రణలంటే ఓకిలించుకోవటం నేర్చుకున్నాం. ప్రాకృతిక జీవనసమస్యల వైపు చూపు మరల్చాం. మానవుడి వ్యక్తిత్వం, వ్యక్తి జీవనం—ఇవి మహత్వపూర్ణములని గమనించాం. మానవుడి మానసిక- ఆధ్యాత్మిక- తృష్ణలు ఆదర్శకాల్పనిక చిత్రణ ద్వారా శాంతిపడవని తోచింది. అందుచేత సాంఘికజీవనసమస్యల పర్యాలోచనకూ, పరిష్కారానికీ కంకణం కట్టుకున్నాం. తత్ఫలితంగా స్వాభావికత, వాస్తవికత రచనలో ప్రవేశపెట్టాం.

. వ్యక్తిజీవనసౌందర్యం మీదనే సామాజిక సభ్యత ఆధారపడి ఉంటుందని 'ఇప్సన్' అభిప్రాయం. ప్రేమలో విశ్వాసం లేకపోవటం, ప్రేమను అవహేళన చేయుటం—ఇవి ఆత్మను చంపుకునేవాడి లక్షణాలుగా ఆయన పరిగణించాడు, అందుచేత ఆయన రచనలన్నీ సంఘానికీ, వ్యక్తికీ నిత్యమూ జరిగే ఘాత ప్రతిఘాతాలను చూపిస్తూ, వ్యక్తిగత ఆదర్శాలు రక్షణీయములని ప్రబోధిస్తూంటవి.

అటువంటి ఫక్కీలోనే తెలుగు సారస్వతంలోనూ కథలు బయలుదేరి వచ్చాయి. సంఘానికి బడితెదెబ్బలు, బల్లెపు పోట్లూ తగిలాయి. ఒక దొంగవాడు ఉంటాడు; వాడుచేసిన అన్ని చోరీలకూ సంఘమే కారణ మన్నారు. ఒక హంతకు డుంటాడు; వాడు ఎన్ని హత్యలు చేసినా దోషం సంఘాని దన్నారు. ఒక యిల్లాలు ఎవరితోనో లేచిపోతుంది; ప్రేమతీపి తెలీని రాతిగుండె సంఘం ఆమె నలాగ వెళ్ళగొట్టిం దన్నారు.

అలాంటి కథలద్వారా సంఘంలోని

కృత్రిమనీతి. కృత్రిమధర్మం--ఇన్నిమాటలెందుకు, కుళ్ళు అంతా తవ్వి చూపెట్టారు ప్రముఖ రచయితలు. మానవనిర్మితాలైన నీతిశాస్త్రాలచేత అతి జటిలములైన జీవన సమస్యల్ని పరిష్కరించటం దుస్తరమేకద! కాబట్టి మనస్తత్వవిశ్లేషణ కథాసాహిత్యంలో ముఖ్యాంగంగా పరిగణింపబడ్డది. పూర్వపు కథలలో మంచిచెడ్డలు స్పష్టంగా పృథక్కరింపబడి, ఆఖరున చెడ్డతనం మీద మంచితనం విజయంపొందటం చూపించేవాళ్లు. కాని ప్రపంచంలో కేవలం 'మంచి'అనిగాని, కేవలం 'చెడు' అనిగాని ఎక్కడుంది? అవి రెండూ ఎప్పుడున్నా ఏదో ఒక నిష్పత్తిలో కలిసే ఉంటవి. కాబట్టి ఈమంచి చెడ్డల పృథక్కరణ సమంజసంగా కనిపించింది కాదు. భీష్ముడు, దధీచి, సీత, సావిత్రి మొదలైన ఆదర్శవ్యక్తులు పౌరాణికకథలలోనేగాని పృథివిమీద పూజ్యం. గాంధివంటి మహాత్ముణ్ణి ప్రత్యక్షంగా చూస్తూకూడా అలా అనుకోటం పొరపాటేమో. అయినా అటువంటి మహానుభావులు నూటికి కోటికి ఎక్కడో ఒకరు ఉంటారు, అంతే—అన్న సమాధానం ఉండనే ఉందిగా! 'ఇనుపకచ్చడాల్ గట్టుకున్న మునిముచ్చు తెల్ల తామరసనేత్ర లిండ్ల బందాలుగారె' అన్నట్టుగా ఎంత నీతిమంతుడేనా ఘనుడైనా పరిస్థితి ఏదేనా ఏర్పడేసరికి పప్పులో కాలేసి ఊరుకుంటాడు. అది సహజం. లోకంలో ఎదుర్కోవలసిన పరిస్థితుల్ని బట్టి మనిషి మారిపోడానికి అవకాశం ఉంది. ఒకానొక వేదాంతి కూడా ఒక పరిస్థితిలో కన్నతండ్రిని బడితె విరగకొట్టి, సవతితల్లిని చంకన ఇరికించుకు పోతాడు. ఎంతో అనుకూలంగా ఉన్న దాంపత్యం కూడా కొన్ని పరిస్థితుల మూలాన్న చెడిపోయి, ఆభార్యాభర్తలు చిరవియోగం అనుభవించవలసి వస్తుంది.

అలాగా కొన్ని తీవ్ర పరిస్థితుల్ని సృష్టించి, ఆ పరిస్థితుల చేతులలో పాత్రలను కీలుబొమ్మల్నిగా చేసి కథలు రాయటం ఆధునిక పంథాలలో ఒకటి. ఆ పరిస్థితులతోటి సంఘర్షణ కారణంగా ఆ యా పాత్రల హృదయాలలోని భావాల ఘాత ప్రతిఘాతాల్ని పరిశీలిస్తూ, వాళ్ళ అపూర్వమనోవ్యాపారాల్ని వర్ణించటం ఈరకపుకథలకు ధ్యేయమయింది. వీరి పాత్రలు—అడిగిన ప్రశ్నకు సరియైన దోవలోనే జవాబు చెప్పకోస్తూ...సత్తాకనుక్కుందామని ఉపాధ్యాయుడు గదిమేసరికి...పప్పులో కాలువేసే బడిపిల్లలులాగా కనిపిస్తారు; వ్యక్తిత్వశూన్యులు. కఠినమైన పరిస్థితి ఎదురువచ్చేసరికి వంకరదారికి మళ్ళిపోతారు. ఇలాంటి కథల్ని సర్వజనరంజకములుగా చేయుటం చాల కష్టం. అటువంటి పరిస్థితులేర్పడ్డప్పుడు మనమైనా అలాగే చేసేవాళ్ళం అని పాఠకుల మనస్సులో విశ్వాసం కుదురుకొల్పటానికీ—ఆయా పాత్రల వైలక్షణ్యాన్ని సమర్థించటానికీ—వాళ్ళ అపూర్వ మనోవ్యాపారాల్ని సమంజసంగా చిత్రించగలగటమే కాకుండా, చక్కని సునిశితమైనతర్కం కూడా (తర్కాభాసం అన్నాసరే) రచయిత ప్రదర్శింపవలసి ఉన్నది. నిజంగా ఈ రకపు కథకుల ప్రతిభ కొనియాడదగిందే, తమ రచనలో విజయం పొందినప్పుడు.

ఈ విధంగా... పాశ్చాత్య సాహిత్యాలు చూపెట్టిన కొత్త కొత్త పంథాలు కారణంగా మన తెలుగు సాహిత్యంలోకూడా విషయవైచిత్ర్యము, రూపవైచిత్ర్యము వచ్చాయి. ఎంతైనప్పటికీ అనుకరణముందే కళ పర్యవసన్నం కాకూడదు. రచయిత అనుభవం—అంటే అతడు జీవితంలో చవిచూచిన రసం, సృష్టిలో అతడు దర్శించిన సౌందర్యం, చిరంతన మానవజీవితంలో గ్రహించిన సత్యం—అతని కళకు ప్రత్యేకత, విశిష్టత తెచ్చిపెడుతుంది. వాస్తవికవాదుల అభిప్రాయమైనట్టి మానవ జీవితాన్ని ప్రతిబింబించేటువంటిదే కళ. సుప్రసిద్ధ జపానీయు కవి నోగూచీ అనే ఆయన కూడా 'Art is the reflection of life' అంటాడు. అంటూ ఇంకోమాట కూడా అన్నాడు: "In giving expression to human life art must ennoble the individual" అంటే, కళ మానవజీవితాన్ని శబ్దరూపేణా అభివ్యక్తము చేస్తూ వ్యక్తిని ఉదాత్తభావోదంచితునిగా చెయ్యాలి. కాబట్టి కథలు అతి వాస్తవికతత్వంలో పర్యవసన్నం కాకుండా...అతి క్షుద్రమైన, ఈర్ష్యా ప్రతిహింసలచే దూషితమైన, సంకుచితమైన ఈ యథార్థ జీవితమునుంచి మనల్ని ఉత్పథానికి కొనిపోయేట్టు ఉండాలి.

ఇప్పటికప్పుడే ఏమయింది? కథాసాహిత్యానికి ఇంకా ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉంది.

# దుర్గాబాయి

[౩౬-వ పేజీ తరువాయి]

ఆమె రాజకీయరంగంలోని అభివృద్ధిని స్మరించే ప్రతివ్యక్తి ఆమెకు ప్రోత్సాహంఇచ్చిన ఇస్తూవున్న మహర్షి సాంబమూర్తిగారిని స్మరింపక తప్పదు.

ప్రభుత్వముకూడా ఆమె ప్రజాసేవను గుర్తించి 1929 లో తూర్పు గోదావరి జిల్లాబోర్డుకి సభ్యురాలుగా నియమించింది, కాని ప్రభుత్వం ప్రజాప్రభుత్వం కాదని గ్రహించిన ఆ వీరాంగన తన కొసంగిన గౌరవపదవిని కాలదన్నినది.

మదరాసు మహానగరం ఆంధ్రుల సొత్తులని నిరూపించడానికి అపూర్వ నిదర్శనం ఒకటి ఆమె జీవితచరిత్రలో కనుపిస్తోంది.

లవణసత్యాగ్రహ సమరసమయంలో ఆంధ్రకుమారులేకాక ఆంధ్ర వనితాశిరోమణులు కూడా మదరాసు రంగంలో వీరవిహారం చేసారు. అందులో దుర్గాబాయి ప్రధమురాలు.

1930 లో గాంధీగారు దండిలో ఉప్పు సత్యాగ్రహం ప్రారంభిస్తే ఆంధ్ర కేసరి ప్రకాశం మదరాసులో ఆంధ్ర వీరత్వాన్ని ప్రదర్శిస్తూ సత్యాగ్రహం చేసాడు.

ఆయనవెనుక మదరాసులో సత్యాగ్రహానికి దుర్గాబాయిని నియంత్రిణిగా నియమించారు. దుర్గాబాయి ఆడు బెబ్బులిఅయి రంగంలో దూకింది వెనుకంజవేయకండా కార్యరంగంలో విహరించింది. ప్రభుత్వ కోపానలానికి గురి అయింది.

ఆమె శరీరం అప్పట్లో ఎన్ని దెబ్బలు భరించిందో వూహించుకుంటేనే వళ్ళు జలదరిస్తుంది. ఆ సత్యాగ్రహంలో ఆమెకు ఒక సంవత్సరం శ్రీకృష్ణజన్మస్థాన వాసం సంప్రాప్తమైంది.

1931 లో జైలునుండి విడుదలకాగానే టామిల్‌నాడ్ నవజన భారత్‌సభకు అధ్యక్షురాలుగాను, అఖిలాంధ్ర మహిళాసమావేశమునకు అధ్యక్షురాలుగాను ఆహ్వానింపబడింది:

అప్పటినుంచి నేటివరకు ఆమె ఆశయం స్త్రీజనాభ్యుదయమే.

1932 లో బొంబాయిలో హిందూస్థాని సేవాదళపు క్యాంపులో శిక్షణ పొందింది. అదే సంవత్సరంలో తిరిగి సత్యాగ్రహంచేసి జైలుకి వెళ్ళింది. ఆమెకు ఆరునెల్లు కఠినశిక్ష విధించింది ప్రభుత్వం.

మీనాక్షీ దేవతచేత పాలితమైన మధుర నగరపు జైలులో ఈదుర్గ ప్రభుత్వమువారి కఠిన శిక్షను అనుభవించింది. నాలుగున్నర మాసాలు పరులను చూడటానికికూడా వీలులేకండా ఘోరాతి ఘోరమైన ఏకాంతవాస శిక్షలో వుంచారు.

బంగారాన్ని పుటము పెట్టినకొద్దీ మెరుగువచ్చినట్లు, వజ్రాన్ని

# చర్చిల్ రహస్యం

ఆంగ్లభాషలో ధారాళంగా ఉత్తేజకరంగా ఉపన్యసింపగల నేటి మహోపన్యాసకులలో విన్‌స్టన్ చర్చిలు ఒకడు.

కాని జీవితారంభంలో అతనివద్ద ఈ పేరురాగల లక్షణాలేవీ లేకుండినవి. నట్టుతూ, తడుమాడుంటూ ఉపన్యసించేవాడు.

ఒకనాడు మాంచెస్టరులో ఉపన్యసించడానికి అతడు వెళుతూవుండగా స్నేహితుడు శాలిస్‌బరీ ప్రభువు అతన్ని ఇట్లా అడిగాడు. 'విన్‌స్టన్! బెరుకుగా వుందా?'

భావికాలంలో బ్రిటిష్ మంత్రి మాణిక్యుడు కాగల విన్‌స్టన్ అప్పుడు తనకు బెరుకుగావుందని ఒప్పుకున్నాడు.

అప్పుడు శాలిస్‌బరీ ప్రభువు చర్చిల్‌కు ఇట్లా ఉపదేశమిచ్చాడు.

'యువకుడా! బెరుకు పడవలసింది ఏమీలేదు. నేను చేసినట్లేచేయి. మాట్లాడడానికి నేను లేవడంతోటే సభలోనివారి నందరినీ ఒకసారి కలియ చూస్తాను. అప్పుడు నేను మనస్సులో అనుకుంటాను- ఎంతమంది మూర్ఖులు పోగయ్యారురా అని. ఇట్లా అనుకోవడంతోటే నామనస్సులో వుండే జంకు, కొంకు పోతాయి,

సానపట్టినకొద్దీ కాంతి కలిగినట్టు దుర్గాబాయిని కష్టపెట్టి హింసించినకొద్దీ ఆమె సంకల్పం సుస్థిరమైంది.

ఈకాలంలోనే ఆమె అద్భుతమైన కార్యం ఒకటి చేసింది.

ఒకనాటి అర్ధరాత్రి పండ్రెండు గంటలప్రాంతంలో ఒక స్త్రీ ఆజైల్లో ఒక పిల్లను పీకనులిమి చంపడానికి ప్రయత్నిస్తోవుండగా ఆ రోదనిని దుర్గ వెంటనే ఆ పిల్లను రక్షించింది.

ఆ పెనుగులాటలో రాక్షసస్వరూపిణి అయిన స్త్రీ దుర్గాబాయిని కొట్టి కరిచింది కాని ఆదెబ్బలకు లెక్కచేయకుండా ప్రాణములమీది ఆశకూడా వదలకుని ఆబాలికను రక్షించడమే తన కర్తవ్యంగా పోరాడి రక్షించింది ఆమె ఈఅద్భుత కార్యమునకు ప్రభుత్వముకూడా నివ్వెరపోయింది.

1933 లో జైలునుండి విడిచిపెట్టారు. అప్పుడు ఆమె ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది, శరీర దారఢ్యంకొరతపడుటవల్ల మూర్ఛరోగం పెనుభూతంలా ఆవహించింది. కాగా ఆమె శ్రేయోభిలాషులు కొందరు ఆమెదృష్టి రాజకీయాల నుండి మరొక మార్గానికి మార్చాలని ఆమెకు యింగ్లీషులో అక్షరాభ్యాసం చేయించారు.

ఆ కుశాగ్రబుద్ధి ఆగస్టు 1933 లో ఎ. బి. సి. డీలు నేర్చుకోడం ప్రారంభించింది. ఆరు మాసాలు అయ్యేసరికి కాశీ హిందూ విశ్వవిధ్యాలయంలో యింటరులో ప్రవేసించింది. ఇంగ్లీషు చదువుకితగిన ధనసహాయం ఆమెకు లేదు. ధైర్యమే జీవిత విన్యాసంగా పెట్టుకున్న ఆలలన నిరాధార పరిస్థితులలో విశ్వవిద్యాలయంలో విద్యార్థిని అయింది.

ఆమె ప్రతిభను గుర్తించి ఆ విద్యాలయంవారు ఆమెకు బిర్లా స్కాలర్‌షిప్ ప్రసాదించారు,

చదువుతూవుండగానే ఆంధ్ర రాష్ట్రమహిళా సమావేశమునకు ఆమె అధ్యక్షతవహించింది.

1935 లో ఇంటర్‌మిడియేట్ ప్యాసుకాగానే ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఆమె ఆనర్సులో చేరింది.

1938 ఆనర్సులో ప్రథమురాలుగా ఉత్తీర్ణురాలయింది. ఆమె ప్రవర్తనకు విద్యాలయంవారు ఆనందించి వెంకటరత్నం నాయుడు గారి పేరటవున్న బంగారు పతకం బహుమతి చేసారు. ఆసంవత్సరమే ఆమెకు అనేకరకాల బహుమానాలు వచ్చాయి.

1939 లో మదరాసు లాకాలేజీలో విద్యార్థినిగా ప్రవేసించింది.

న్యాయవాదివృత్తికి చదవడమే కాకండా ఆంధ్రనగరమైన మదరాసు నగరంలో ఆంధ్రస్త్రీల నందరను ఒకచో కేంద్రీకరించుటకుగాను ఆంధ్రమహాసభలోనుంచి స్త్రీలశాఖను వేరుచేసి దానికి ప్రత్యేకమైన నూతన చైతన్యం కలిగించింది.

ఆమె శక్తివంచన లేకండా దాని

---

# రూజువెల్టు ప్లీడరీ

అమెరికన్ అధ్యక్షుడు రూజువెల్టు నేడు ప్రపంచమహాపురుషుడైవున్నాడు. అతని జీవితారంభాన్ని గురించిన ఈ చిన్నకథ చమత్కారంగా వుండగలదు.

అవి రూజువెల్టు న్యూయార్కులో ప్లీడరుగా ప్రాక్టీసు ప్రారంభించిన రోజులు. అతడు ఒకసారి క్లిష్టమైన ఒక సివిలుకేసులో పనిచేయవలసివచ్చింది.

ఎదిరిపక్షపు ప్లీడరు మంచిపేరున్నవాడు. పైగా వాదనాపటిమలో మేటి.

ఐతే ఏమి ఆకేసులో అతడు ఒక తప్పుచేశాడు. తనవాదాన్ని దీర్ఘతరం చేశాడు. అతని ఊకదంపు ఉపన్యాసాన్ని న్యాయాధికారులు అంతగా వినకపోవడాన్ని రూజువెల్టు గుర్తించాడు.

తాను వాదింపవలసివచ్చినప్పుడు రూజువెల్టు లేచి ముక్తసరిగ ఇట్లా అన్నాడు.

'మహాశయులారా! సాక్ష్యం యావత్తూ వినివున్నారు. మహోపన్యాసకుడైన నామిత్రుని వాదాన్ని ఆలించివున్నారు. అతని వాదాన్ని నమ్మి, సాక్ష్యాన్ని నమ్మకపోయినట్లయితే మీరు తీర్పు అతనికి అనుకూలంగా చెప్పవలసి వుంటుంది.'

న్యాయాధికారులు ఐదునిముసాలు మాత్రం సంప్రదించుకుని రూజువెల్టు పక్షాన్ని తీర్పు చెప్పారు.

అభివృద్ధికి అహర్నిశలు పాటుపడు తోంది. ఆంధ్రులు నేడు గర్వింప తగ్గ సంస్థ మదరాసులో అది ఒక్కటే అని చెప్పాలి. రాజులను రాణులను కూడగట్టుకొని దానిని అభివృద్ధికి సర్వదా ప్రయత్నిస్తూ వుంటుంది దుర్గాబాయి.

1941 సెప్టెంబరులో ఆమె బి.ఎల్. పరీక్షలో ఉత్తీర్ణురాలైంది. ఒక పదిఏండ్లలో విద్యాశిఖరం చేరినవారు లేనేలేరు అందులోను స్త్రీలలో అసలు లేరు. ఆంధ్రదేశంలో బి. యల్ పరీక్షలో అగ్రసరురాండ్రయిన స్త్రీలలో ఈమె ప్రధానురాలు.

ఈమె ఇంగ్లీషు, తెనుగులలోనే కాక హిందీలోకూడా అనర్గళంగా ఉపన్యసింపకలదు. కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో జరిగిన అఖిలభారత హిందీ వక్తృత్వ పోటీపరీక్షలో ప్రథమ బహుమానం పొందిరిది. ఆమె ఆంధ్రదేశంలో చేసిన హిందీప్రచారానికి గాంధీ మహాత్ముడు సంతసించి అలహాబాదులో జరిగిన కాన్వొకేషనులో ఆమెకు ఒక బంగారు పతకమును ప్రసాదించాడు. అప్పట్లో ఆమె జైలునందున్నది.

ఆమె విజ్ఞానాభివృద్ధిలో యిట్లు మునిగి తేలుతూవున్నా ఆమె యింటిపనులలో ఏమరివుండదు. చిన్న పిల్లలకు పువ్వులుకుట్టడం జడలు వేయడం అంటే ఆమెకు అపరమిత ఆనందం, పదిమందికి స్వయంగా వండిపెట్టడంఅంటే ఆమెకు సంతోషం.

గిద్దెడుబియ్యం గుజ్జన్నంగూడు వండలేని స్త్రీలలో నిండారిన నవయుగంలోకూడా ఆమె ఇతరుల సహాయం లేకండా నూరుమందికి వంటరిగా వండిపెట్టగలదు.

ఆమె బొబ్బట్లు వండుటలో ప్రవీణురాలు అని వినికిడి.

పేరుపొందినకొద్దీ ఆమెకు అడకువ, నమ్రత అధికమౌతోంది.

ఆమె పరిచయం వున్నవారికి ఆమె సౌహార్ద్రహృదయం బాగా అర్థమౌతుంది. ఒకసారి ఆమె పరిచయం కలిగినవారు ఆమెను మరువలేరు,

తన అభిమానానికి పాత్రులైన వారికి తన సర్వస్వమూ ధారపోసే త్యాగశీలిని ఆమె.

విద్యావతి, దేశసేవా పరాయణ, సంఘసేవాధురీణఅయిన ఆ ఆంధ్రపుత్రి భావి ప్రకాశమానమైందని చెప్పవచ్చు. ఆంధ్రరాష్ట్రంవచ్చినప్పుడు ఏర్పడే మంత్రివర్గంలో ఆంధ్రస్త్రీలకు ఒకస్థానం మినహాయింపబడే కల్పంలో ఆస్థానానికి శ్రీమతి దుర్గాబాయమ్మ మొదలిపేరై వుండగలదనుట నిర్వివాదాంశము.

---

# ఆకుకూరలు

అవిసె – ఉస్తి – కరివేప – కామంచి – కాబేజీ – కొత్తిమిరి – కోలపాల – గుంటగలగర – గోగు – చక్రవర్తి – చామ – చింత – చిర్రి – చిలుకకూర – చుక్క – తేమలపాకు – తుమ్మి – తోటకూర – దొగ్గలి – దోస – నీరుల్లి – పుదీనా – పొన్నగంటి – బచ్చలి – బలుసు – బొద్ది – మునగ – మెంతి – వేప – సరస్వతి – సీకాయ అనే ముప్పయి ఒక్కరకాల ఆకుకూరల వివరాలు గలవు. ఆకుకూరల ప్రాశస్త్యాన్ని వివరించే చక్కని పీఠికకూడా వున్నది.

## విజ్ఞాన విషయాలు

నిబ్బాచేసే రహస్యాలు; రాతినుంచి గిన్నెలు చిప్పలు బోలిచే నేర్పరితనమూ పదిలక్షల సంవత్సరాల పూర్వంనుంచీ చైనావారికి తెలుసు.

... ... ...

ప్రపంచంలోకల్లా అతి ప్రాచీనమైన సంగీత పాఠశాల రోములో వుంది. అది 1566 లో స్థాపితమైంది.

... ... ...

ఒక చతురపు అడుగు తేనెపట్టులో తొమ్మిదివేల గదులు వుంటాయి.

... ... ...

ఎలుక, సీమపందేలు మున్నగు జంతువుల దంతాలు అనుక్షణమూ ఎదుగుతూనే వుంటాయి.

... ... ...

ఏభైఏళ్ళ తన జీవితంలో మనిషి ఆరువేలరోజులు నిద్రలోనే గడిపివేస్తాడు.

... ... ...

డెడ్‌సీ అనబడే సముద్రంలోని నూటికి ఇరవైఐదుపంతులు ఉప్పువుంది. మామూలు సముద్రపు చేపను అందులో వేసినట్లయితే వెంటనే చనిపోతుంది.

... ... ...

చైనాలో నూటికి తొంభైఎనిమిది మందికి చదువురాదు.

... ... ...

గుర్రాలికి కనుబొమలు వుండవు, చేపలికి కనురెప్పలు వుండవు.

[మొదలుపేజీ తరువాయి]

అట్టి తీర్మానాన్నే చేసింది. ఈరెండుసభలకు పూర్వమే నడిచిన శ్రీబాగ్ ఒడంబడికలో సర్కారు ఆంధ్రులు భావి ఆంధ్రరాష్ట్రానికి మదరాసును రాజధానిగా చేస్తామని రాయలసీమ ఆంధ్రులకు కరారుచేసి వున్నారు. ఇంత జరిగినా ఈవిషయమై ఆంధ్రులింకా నిశ్చితాభిప్రాయులు కాలేదనే అనుమానాన్ని విశాఖపురి ఆంధ్రమహాసభా వ్యవహారాలుకలిగిస్తున్నాయి. విశాఖపురి ఆంధ్రమహాసభాధ్యక్షులైన సర్ విజయగారు రాజధాని విషయమై చేసిన ప్రసంగంలెస్సయి వుండలేదు. మదరాసు తత్కాలిక రాజధానిగా వుంచుకోవాలట. అనంతరం క్రొత్తరాజధాని ఏర్పరచుకోవచ్చునట ఏమిమాటలివి? నిలకడలేని ఇట్టిమాటలవల్లనే రాయలసీమవారు మనపట్ల అనుమానరహితులుకావటంలేదు. దీనికితోడు గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్టుగా అయ్యదేవరవారి అప్రస్తుత ప్రసంగం మరింత అనుమానానికి ఆస్కారమౌతోంది. తెలింగానామీదవున్న అభిమానం రాయలసీమమీద వున్నట్టు గోచరించడంలేదు. ఈఅనుమానాలను పారదోలి రాయలసీమ సోదరులను కూడకట్టుకోనినాడు ఆంధ్రరాష్ట్రసమస్య కరిమ్రింగిన వెలగపండువంటిదే అవుతుంది. మద్రాసు ఆంధ్రరాష్ట్ర రాజధాని అని ఏకగ్రీవంగా ఒప్పుకున్ననాడే ఆంధ్రరాష్ట్రప్రాప్తి.

**నాటకకళా పరిషత్తు: నవ్యకార్యకలాపము**

ఆంధ్రనాటక కళాపరిషత్తు 11–వ సమావేశం ఈ నెలాఖరున మద్రాసులో జరపడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఇంతవరకు తెలియవచ్చిన కార్యక్రమంయొక్క ధోరణిని గమనించాగా ఈసమావేశం నవోత్సాహంతో సాగేటట్లుగావుంది ప్రఖ్యాతాంధ్ర నటకులు శ్రీ డి. వి. సుబ్బారావుగారు అధ్యక్షతవహిస్తారు. శ్రీ పీఠికాపుర సంస్థానాధీశ్వరులు సభాప్రారంభం గావిస్తారు ఆంధ్రదేశంలోని వివిధ నాటక సమాజాలు మద్రాసుకువచ్చి డిశంబరు 21 నుండి 30 వరకు పదిదినాలు పది నాటకాలు ఆడడానికి ఏర్పాట్లు జరిగాయి. ఆయానాటక సమాజాల ప్రదర్శనా ప్రాభవానికి ఉచితరీతిని బహుమతులీయడానికి వ్యవహర్తలు నిర్దేశించారు నాటకశాఖకు సంబంధించిన విషయమై వ్యాసాలు వ్రాయించి బహుమానాలీయడానికి కూడా సంకల్పించారు. భరతనాట్యాది ప్రదర్శనాలుకూడా జరిపింపనున్నారు. ఈకార్యకలాప నిర్వహణానికి కార్యదర్శి కొత్తపల్లి లక్ష్మయ్యగారు మిక్కిలి పరిశ్రమిస్తున్నారు. వారి పరిశ్రమ ఫలప్రదము కావాలని కోరుతున్నాము.

Printed at the Andhrabhumi Printing Works, 13 Mukhatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher : Andra Seshagiri Rao B.A.



పాఠకులకు విజ్ఞానాన్ని పెంపొందిస్తూ వినోదాన్ని సమకూరుస్తూ ఆంధ్ర గృహాలను అలంకరిస్తూ ప్రకటనకర్తల వ్యాపారవిస్తృతికి చేయూతనిస్తూ నేటికి తొమ్మిదేళ్లుగా అలరారుతూన్న

# ఆంధ్రభూమి

1942 జనవరి సంచికను సర్వాంగసుందరంగా సంక్రాంతి ప్రత్యేక సంచికగా వెలువరింప సంకల్పించుకొన్నది. మా సంకల్పమునకు పాఠకులు రచయితలు ప్రకటనకర్తలు తప్పక తోడ్పడెదరని ఆశిస్తూన్నాము. ప్రకటనకర్తలు తమ ప్రకటనలను 20-వ తేదీ లోపుగా అందచేయ ప్రార్థన:—

## ప్రకటరేట్లు వివరములు.

| | | | | |
|---|---|---|---|---|
| 4-వ కవరు పేజీ | నెలకు ఒక ముద్రణకు | ... | రూ | 25—0—0 |
| 2-వ కవరు పేజీ | ,, | ... | ,, | 20—0—0 |
| 3-వ కవరు పేజీ | ,, | ... | ,, | 20—0—0 |
| సాధారణపు పుట | ,, | ... | ,, | 15—0—0 |
| అర పేజీ | ,, | ... | ,, | 8—0—0 |

సంవత్సరం పొడుగునా ప్రకటించేవారికి
నూటికి 25 చొప్పున తగ్గింపబడును.

ఆంధ్రభూమి — వేపేరి, — మదరాసు.